## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 5010010033124



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీరస్తు.

# రుక్మిణీపరిణయము.

బొమ్మరాజు - సీతారామకవిప్రణీతము.

బ్రహ్మశ్రీ, పంచాగ్నుల - దక్షిణామూర్తిశాస్త్రులవారిచే

పరిష్కృతము.





వెన్నెలకంటి వేంకటసుబ్బారావుగారి

ద్రవ్యసహాయమువలన

"వావిళ్ల - రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్" వారి

ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు

ముద్రితము.

చెన్నపురి.

Price 8 Annas.] 1911 [Registered Copy-Right.

# భూమిక.

---

బుధసత్తములారా !

ఒంగోలు తాలుకా క్రొత్తపల్లిపురవాస్తవ్యులును, నాకు పరమమిత్రులు నగు మ-రా-రా-శ్రీ, క్రొత్తపల్లి లక్ష్మీనృసింహము పంతులవారు మాగ్రామంబున కేతెంచియుండిన కాలమం దొక్కనాఁడు భాగవతమునం దుండు రుక్మిణీకల్యాణ కథాపద్యములం జదువుచు, ప్రసంగవశంబున వారీరుక్మిణీకల్యాణవృత్తంబు రూపకంబుగా రచియించుమని నన్నుఁ బ్రోత్సాహపఱచిరి. నే నందులకు సమ్మతించియు నా కీనాటకరచన కిదియే ప్రథమప్రయత్న మగుటం జేసి, యీకవితాముగ్ధాంగన విద్యాప్రౌఢుల రగుతమచిత్తముల నెట్లలరించునో యనుసందియంబు వొడమియు, 'గుణవద్వస్తుసంసర్గా ద్యాతి స్వల్పోఽపి గౌరవమ్, పుష్పమాలానుషఙ్గేణ సూత్రం శిరసి ధార్యతే'అను నార్యవచనానుసారముగా భగవంతుం డగుశ్రీకృష్ణునికథాసుధాలహరి యిం దభివర్ణింపఁబడిన దగుటచేఁ గొంతవఱకు మిమ్మానందింపఁ జేయకపోవునా యనునమ్మకముతో వ్రాయఁగడంగి దైవానుగ్రహమున నాతిచిరముననే రుక్మిణీపరిణయ మను పేర నైదంకములనాటకముగా దీనిని ముగించితిని. మఱియు నాశక్తి నైనను విచారించుకొనక వ్రాయఁబూనుటకు భగవత్కథయందలి నాకుఁ గలయభిరుచియే ముఖ్యకారణము. ఇం దెచ్చట నేని ప్రమాదజనితదోషము లున్నచో గుణగ్రాహు లగుదోషజ్ఞులు మన్నింపఁ గడుఁగడుఁ బ్రార్థితులు. మఱియు

న స్నిసదుద్యమమునకుఁ బురికొల్పినశ్రీపంతులుగారికిని, కార్య భారముచేఁ దమకెంతయుఁ దీరిక లేకున్నను నావేఁడికోలు నంగీకరించి యీనాటకబ్బము నామూలాగ్రము కడుశ్రద్ధతోఁ బరిశీలించియిచ్చిన మామిత్రులు బ్రహ్మశ్రీ, పంచాగ్నుల-దక్షిణామూర్తిశాస్త్రిగారికిని, ముద్రణకాలమందు నాకేమాత్రమును శ్రమను గలిగింపకయే నాలిఖితపుస్తకమున కొకక్షరమేనియు భేదము లేకుండ నతిశుద్ధముగను, సుందరముగను, వేగముగను ఈగ్రంథమును ముద్రింపించియిచ్చిన మెసర్సు "వావిళ్ల-రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్" వారికిని ఈగ్రంథముద్రణమునకు ద్రవ్యసహాయమొసఁగి నన్నానందింపఁజేసిన మా వెన్నెలకంటి-వేంకటసుబ్బారావుగారికిని నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

సీ. మాతులాత్మజకుఁ గు◆మారుఁడై నను బాబు
    బా బటంచు వచించు◆బంధుఁ డెవఁడు
  పూర్వాణభాషావి శే◆షోన్నతి వహించి
    సభ్యుల మెప్పింపఁ◆జాలె నెవఁడు
  నారుక్మిణీపరి◆ణయ మచ్చుఁ గూర్పింప
    ద్రవ్య మిచ్చిన నెఱ◆దాత యెవఁడు
  బాల్యంబునుండి నా◆వచనంబు మీఱక
    కోరిక లిచ్చుస◆గ్గుణుఁ డెవండు,
తే. భావహితుఁ డెవఁ డఖిలార్థ◆భాగి యెవ్వఁ
  డట్టి వెన్నెలకంటివం◆శాబ్ధిసోముఁ
  డైన వేంకటసుబ్బరా◆యాఖ్యుఁ బ్రీతి
  రుక్మిణీధవుఁ డెప్డుఁ బ్రోచుఁగాత.

ఇట్లు,
బొమ్మరాజు, సీతారామయ్య.

## ఈనాటకమందు వచ్చుపాత్రలు.



### పు రు షు లు.

| | |
|---|---|
| 1 భీష్మకమహారాజు. | (రుక్మిణీదేవి తండ్రి) |
| 2 రుక్మరథుఁడు. | (భీష్మకుని రెండవపుత్రుఁడు) |
| 3 రుక్మి | (భీష్మకుని పెద్దకుమారుఁడు యువరాజు) |
| 4 న్యాయబుద్ధి | (భీష్మకుని మంత్రి) |
| 5 దుర్మిత్రుఁడు | (యువరాజు చెలికాఁడు) |
| 6 నారదుఁడు | (దేవర్షి) |
| 7 శిశుపాలుఁడు | (చేదిపురాధిపతి) |
| 8 దంతవక్త్రుఁడు<br>9 జరాసంధుఁడు<br>10 సాళ్వుఁడు<br>11 పౌండ్రకవాసుదేవుఁడు | (ఈనలువురు శిశుపాలుని స్నేహితులను భూమిపతులును) |
| 12 బలరాముఁడు | (శ్రీకృష్ణునియన్న) |
| 13 శ్రీకృష్ణుఁడు | (కథానాయకుఁడు) |
| 14 చతురమతి | (శ్రీకృష్ణుని నర్మసఖుఁడు) |
| 15 సాత్యకి | (శ్రీకృష్ణునితమ్ముఁడు) |
| 16 అగ్నిద్యోతనుఁడు | (రాజపురోహితుఁడు) |
| 17 జయుఁడు<br>18 విజయుఁడు | (శ్రీకృష్ణుని సేవకులు) |
| 19 భద్రుఁడు<br>20 మందారుఁడు | (పౌరులు) |

21 జయసేనుఁడు
22 వీరసేనుఁడు (గంధర్వులు)
23 రథసారథి (శ్రీకృష్ణుని రథమునడుపువాఁడు)

స్త్రీ లు.

1 రుక్మిణీదేవి (కథానాయిక)
2 చంద్రకళ
3 కీరవాణి (రుక్మిణీదేవిసఖులు)
4 సత్యశీల (భీష్మకుని భార్య)
5-6 (ముత్తైదువలు——)



శ్రీ గోపాలకృష్ణపరబ్రహ్మణే నమః.

# రుక్మిణీపరిణయము.



శా. శ్రీరామామణిఁ గూడి వేడుకలరం గ్రీడించుచిత్తంబునన్
నీరేజోదరజాండరూపకములన్ నిర్మించి పోషించి సం
హారోద్యోగ మొనర్చి నాటకునిచా యన్మించులీలాద్భుతా
కారుండౌహరిమాకొసంగుతయశః కామార్థసమ్మోదముల్.

మఱియు,

సీ. పద్మభవాండంబు సద్మంబుఁ గావించి
పలుచిత్రసృష్టి రంగుల నమర్చి,
సాంధ్యరాగారుణచ్ఛవిని తెరలు జేసి
తతజీవసమితిఁ బాత్రలుగఁ జేర్చి,
రవిచంద్రులను దీపరాజిగా నొనరించి
శ్రుతిశిరస్సులను సుశ్రుతి యొనర్చి,
సామవేదంబును స్వరతతిగాఁ జేసి
యంబుధిధ్వని మృదంగం బొనర్చి,

గీ. స్థితిలయోదయచరితలఁ • గృతులఁ గూర్చి
ప్రకృతినాయికఁ గూడి సా•మ్రాజ్యపదవి
నాట లాడించువిష్ణుఁ డీ•నాటకులకు
సంప్రమోదార్థశుభము లొ•సంగుఁగాత.

(నాంద్యంతంబున సూత్రధారుఁడు ప్రవేశించి పుష్పాంజలిం జల్లి)

నేఁ డాచరించిన మంగళార్థప్రసంగంబునకు హేతు వారయ నాప్రేయసిని రావించి సంభాషించిచూచెద.

(తెరవంకఁ జూచి) ప్రియా! యిటు రమ్మీ.

(నటి ప్రవేశించును.)

నటి.—ఆర్యపుత్రా! వందనములు. నన్నుం బిలచినకారణం బేమో దయచేసెతెంగింపుడు.

సూత్ర.—సుందరీ! నీవింగితజ్ఞ వగుదువేని కారణం బిట్టిదని నేఁ జెప్పకమున్నె నీవు గ్రహింపవచ్చునుగదా!

నటి.—నాయకా! చపలస్వభావలగు స్త్రీజనంబులకు పరాభిప్రాయంబుఁ దెలియుట దుర్లభంబుగదా!

సూత్ర.—ఔరా? నీ వెఱింగియు నాయెడ గౌరవముం జూపితివి. కాని నీ వించుక సేపు తాళుము! ఇప్పు డీసదస్యులం గూర్చి విజ్ఞాపనం బొక్కటి యొనర్పు మని కవి నా కిట్లని యానతిచ్చె, నది యిందే యుండి వినుము.

ఆ-వె. అరయ నాంధ్రసంస్కృ•తార్థలక్షణవేద్యు
లార్యులార పొత్త•మందు నున్న
తప్పులెల్ల సైఁచి•యొప్పులుగా నెంచి
యింపుమీఱఁగా గ్ర•హింపవలయు.

నటి.—ప్రియుఁడా! కవి యసమర్థతనుబట్టిగాక గ్రంథంబులందు దోషంబు లెట్లుండును?

సూత్ర.—ప్రేయసీ! అట్లనుకొనుట యసంగతంబు. ఏమనిన, ప్రమాదవశంబునఁ గొన్నిచోట్లఁ బొరపాట్లు తటస్థించును. అంతమాత్రంబుననె తెలియక చెప్పె ననుట కల్ల. అదియునుంగాక,

ఉ. శ్రీపతిసత్కథామృతవి♦శేషమునం జెలువారునట్టి యీ
రూపకమందు దోసముల♦ప్రోవు వసించిన నీద్యమే యగుం
జూపఱ కెల్ల సంతసముఁ♦జొన్పడిచంద్రుఁడుఁ దాఁగళంకముం
బొఁడియు న్ప్రకాశమును♦జెందువిధంబున నోమనోహరీ.

నటి.—వయస్యా! కవిత్వ మట్లురసవంతంబుగా శోభిల్లినదైన నాటకప్రదర్శకు లెట్లాడినను గొఱంత జూపట్టునా?

సూత్ర.—ఓహో? నీ వట్లాలోచించితివా! అట్లుగాదు వినుము.

తే. గీ. కూరిమి నపుంసకుని రంభ♦గోరినగతి
బధిరుసన్నిధి శంఖార♦వంబుభాతి
వ్యర్థ మౌఁగాదె రూపకా♦వక్రగరిమ
యరసికులు నాటకము లాడ♦నబ్జవదన.

గావున రసవంతంబై నాటకంబును, రసికులుగ తన్నిర్వాహకు లగు నటులు నుండిన నారూపకంబు మిక్కిలి శోభించును.

నటి.—ప్రాణేశ్వరా! నాటకపాత్రంబుల సిద్ధపఱుచుట కిప్పుడు మనము ప్రదర్శింపవలసిన నాటకం బెద్ది?

సూత్ర.—చెప్పెద వినుము.

ఆ-వె. కల్మషాపహంబు♦కామార్థఫలదంబు
దేవకీకుమార♦భావితంబు

భద్రకారణంబు♦రుద్రాదివినుతంబు
రుక్మిణీపరిణయ♦రూపకంబు.

మన మిప్పు డీనాటకంబు ప్రదర్శింపవలెను.

నటి.—నాయకా! ఇక్కథ ప్రాచీనకవికృతంబా? లేక, నవీనకల్పితంబా?

సూత్ర.—నాయికా! ఇది శ్రీవేదవ్యాసమునిప్రణీతం బగుసంస్కృతభాగవత మహాపురాణంబుననుండి బమ్మెరపోతనామాత్యకవిశేఖరునిచేఁ దెనిగింపంబడి యిదివఱకు జగత్ప్రశస్తం బైనదే.

నటి.—అయిన నది యీనాటకరూపంబున రచించినవా రెవ్వరు?

సూత్ర.—సఖీ! ప్రదర్శకుల నైపుణ్యముఁ జూచి సంతసింపవలెఁగాక యిప్పుడు రచించినకవినామధేయంబుతో నేమిపని?

నటి.—సఖా! యే మట్లంటిరి?

తే-గీ. అవని లోకోపకారంబు♦నాత్మఁ బూని
నాటకంబుల రచియించి♦నటుల కిచ్చి
మాన్యతను గన్న యక్కవి♦ధన్యు పేరు
జెప్పినంతనె సరసత♦దప్పిపోనె.

సూత్ర.—ఆసంగతి నాకుమాత్రము దెలియదా? వారు లోకోపకారపరాయణులే యగుదురు.

నటి.—దాని నిందలిసదస్యులును వినఁగోరుచున్నారు గాన నడిగితిని.

సూత్ర.—అట్లయినఁ జెప్పెద వినుము.

తే-గీ. వెలయుశ్రీవత్సగోత్రుఁడా♦ర్వేలకులుఁడు
బొమ్మరాజకులాబ్ధి సం♦పూర్ణవిధుఁడు
పద్మనాభునిపుత్రుండు♦భవ్యయశుఁడు
వాసిఁగనినసీతారామ♦భూసురుండు.

నటి.—కాంతా! నాటకారంభంబున కింకఁ దడవేల? నేఁ బోయెదను.

సూత్ర.—మాటలసందడిచే మఱచితిని. శరదృతువుంగూర్చి యించుక గాన విశేషంబున సభ్యుల డెందం బమందానందంబుఁ జెందింతము.

నటి. తే-గీ. రాజహంసకులాకీర్ణ • రాన మెచ్చు
లలితపద్మాస్యసంగతా • ళులు పొనర్చు
మధురగానంబు లొప్పె హై • మవతిపూజ
లెసఁగ నన్నిదోఁచె నో • బిసరుహాక్షి.

ఇది ప్రస్తావన



శ్రీ ర స్తు.

శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణే నమః.

---

# రుక్మిణీపరిణయము.

## ప్రథమాంకము.

స్థలము.—రాజసభాభవనము.

(భీష్మకుండును, న్యాయబుద్ధియు, రుక్మరథుండును, సింహాసనంబుల నుందురు.)

ద్వారముకడ సేవకుఁ డుండును.

భీష్మ.—మంత్రివరా! మద్వంశసుధార్ణవంబున రమాదేవింబోలె. మత్సుకృత విశేషంబున నవతరించి దినదినప్రవర్ధమానయై విలసిల్లుచున్న బాలామణి యగురుక్మిణీకన్యను సద్వంశసంజాతుండును, సకలసద్గుణసద్రూపసత్ప రాక్రమధౌరేయుం డగుపురుషవరేణ్యున కొసంగి వివాహంబుఁ గావించి ధన్యత్వంబుఁ జెంద నాజన్మంబున కిదియకదా సార్థకతమం బగుసమయంబు! మఱియు,

తే-గీ. సుతను జనకుండు తగినసుప్రతున కిచ్చి
పెండ్లిఁ గావింప నాతనివెనుకవారు
ముందుఁ బుట్టెడువారును మోక్షపదవి
నుండెద రటంచు శ్రుతు లనుచుండ వినమె.

కావున మద్హితపరాయణుండ వగునీవు వరణీయుం డగురాజకుమారు నారసి యెఱుంగఁ జెప్పుము.

న్యాయ.—రాజేంద్రా! సుగుణమణి యగు భవత్కుమారికామణి కమానుషసుగుణసుందరపరాక్రముఁ డగు వరుండు గావలయుఁ గాని సామాన్యరాజన్యు లెందఱు లేరు ? నామనంబున నారయ నొక్కసుగుణరాశి గన్పట్టుచున్నవాఁడు. వినుము.

ఉ. ఆతఁడు పద్మనేత్రుఁడు కృ♦పాకరుఁ డాశ్రితవత్సలుండు వి
ఖ్యాతసుకీర్తి నీలతను♦కాంతివిరాజితుఁ డార్యపూజితుం
డాతతబాహుఁ డుత్తముఁడ♦హర్పతితేజుఁడు సూభవత్తనూ
జాతకు భర్తగాఁదగును♦సద్గుణశీలుఁడు కృష్ణుఁ డోనృపా !

(ఉ. మారుఁడు యక్షువల్లభకు♦మారుఁడు చంద్రవసంతు లాశుభో
దారుని సోయగంబునకుఁ♦దథ్యము నారయ నీడుగారుస
త్సూరినుతుండు ద్వారకను♦సొంపుగ నేలుచు నున్నవాఁడునీ
వారసికాగ్రగణ్యునకు♦నాత్మజ నిచ్చి యశంబు నొందుమా.)

భీష్మ.—అమాత్యచూడామణీ! నామనోనేత్రంబులఁ బొడకట్టుచున్న యా దివ్యమూర్తియే నీహృద్గోచరుండగుటచే ప్రహృష్టచేతస్కుండ నైతి. నీవాక్యంబు లత్యంతశుభావహంబు లయ్యెఁగాన భావికార్యాలోచనంబునకుఁ గర్తవ్య మెద్ది ?

న్యాయ.—రాజేంద్రా ! ఇంక నాలోచనం బేమియు లేదు. ఆయదునందనుండు భవత్కుమారియందు సాభిలాషుండై యున్నట్లు మున్నొక్కనాఁ డక్రూరునివలన నే వినియుంటిని గాన భవదాస్థానాశ్రితుం డగు నగ్నిద్యోతను నిచ్చటికి రావించి, శుభలగ్నంబు నిర్దేశించి, ద్వారకావాసుం డగు నవ్యాసుదేవునకు శుభలేఖనంబుఁ బంపుట కాజ్ఞాపింపుఁడు.

భీష్మ.—(సేవకునివంక జూచి) సేవకా! నీవు, పురోహితు లగు నగ్నిద్యోతనుల వారి నిచ్చటికిఁ దోడ్కొనిరమ్ము.

సేవ.—అయ్యా! చిత్తము (అనిపోయి అగ్నిద్యోతనుతోఁ బ్రవేశించును)

భీష్మ.—మంత్రి, రుక్మిర, (లేచి) భూసురోత్తమా వందనములు (అని నమస్కరింతురు)

అగ్ని.—అభీష్టావాప్తిరస్తు. (అని ఆశీర్వదించును)

భీష్మ.—విప్రోత్తమా! యీపీఠంబు నలంకరింపుఁడు (అని అందఱుఁ గూర్చుండుదురు)

భీష్మ. తే-గీ. నాతనయ రుక్మిణీశుభ • నామధేయ
శౌరి కొసఁగి వివాహంబు • సల్ప నుంటి
సంతసముమీఱ సుముహూర్త • సమయ మరసి
శాస్త్రవిధిఁ జెప్పవే బుధ • చంద్ర నేఁడు.

అగ్ని.—(పంచాంగంబు వీక్షించి, గ్రహములు లెక్కవెట్టుచు) మహారాజా! నేఁటికైదవదినంబున నొక్కసుముహూర్తంబు పంచకరహితంబై సతిపతు లిరువురకు పరమమైత్రతారాయుక్తంబై యున్నది. దానికి సవతు గలముహూర్తంబు లీమాసంబుననే కాన్పించవు.

భీష్మ.—ప్రధానాగ్రణీ! తన్ముహూర్తక్రమంబున శుభలేఖనంబు వ్రాయించి యీబ్రాహ్మణోత్తమున కొసంగుఁడు.

న్యాయ.—చిత్తము. (బ్రాహ్మణునిఁజూచి) అయ్యా భూసురాగ్రణీ! మీకు లేఖనం బొసంగెద నావల మద్గృహంబునకు దయచేయుఁడు.

అగ్ని.—మంచిది (అని నిష్క్రమించును)

రుక్మిర.—(లేచి తనలో)

ఉ. అన్నమనంబుఁ దాఁ దెలియఁ • డయ్యెఁ గురుండు ముహూర్తమా కడుం, గ్రన్నన వచ్చె నగ్రజుఁడు • రాఁడలచేదిపురంబు వోయి యీ, యున్నవిధంబు విన్నమది • నొప్పుఁ డటంచును దోఁచె చైద్యునీ, కన్నియఁ గూర్తునంచు మది • గల్గెను వానికి దేటివైరమో.

ఇది యెట్లున్నను; అక్కడ

చ. అలికులవేణి కృష్ణుఁ బట♦ణంబునఁ జూచిననాఁటనుండియుఁ
వలచి తదీయరూపమును♦వర్ణనసేయుచు నన్నపానముల్
దలఁచక క్రుగ్గుచుండె వని♦తాతతికిం దగఁ జెప్పుచుండె నా
చెలియలిభాగ్య మిట్టి దని♦చెప్పఁగ శక్యమె శౌరి కిచ్చినన్.

ఈ మెమనం బిట్టి దని జనవిభుండెఱింగియు సభాముఖంబున వరుని నిర్ధారణంబు గావించె. మదగ్రజుండు సమ్మతించెనేని సులభంబై గృహకల్లోలంబులేక సుఖంబుగ నిక్కార్యంబు నెఱవేఱఁగలదు. విధికృతం బెట్లగునో యెఱుంగ. (ప్రకాశముగా)

ఉ. సంతసమయ్యెఁగాని నృప♦చంద్ర మదగ్రజుఁ డింట లేఁడు నేఁ
డింతయు విన్ననాతఁ డెటు♦లెంచునొ వచ్చినదాఁక యీదినం
బంతయుఁ జూచి బ్రాహ్మణుఁ♦బంపుద మాదనుజారిపేటికిన్
వింతలు గాకమున్నె వినుపించి యొనర్పుము కార్యపద్ధతిన్.

చెప్పకనే యాదవేంద్రున కెఱింగించినపిదప సిద్ధాంతం బగును. అంత నితం డొప్పమి మర్యాదబోవుటయేగాక వైషమ్యం బుత్పన్నంబగును. దీని కింత యేల? వచ్చినతర్వాత కార్యాలోచనంబుఁ జేసి నిర్బాధకంబును, నిర్వివాదం బగుమార్గం బనుష్ఠింతము.

భీష్మ.—కుమారా! నాకుమాత్ర మింతలో త్వరపడవలసినంతకారణ మేమియున్నది? నీ వాడినట్లు లాతండు వచ్చినపిదపనే యాలోచింతము. (మంత్రివంక జూచి) ప్రధానాగ్రణీ! నీ వేమి చెప్పెదవు?

న్యాయ.— రుక్మరథుండు సెప్పిన ట్లొనర్చుటయే శ్రేష్ఠంబుగానున్నది. రుక్మియును వచ్చువేళయైనది.

సేవ.—మహారాజా! యువరాజుగా రగురుక్మియును, ఆయనచెలికాఁ డగు దుర్మిత్రుఁడును ఇటకరుదెంచుచున్నవారు.

భీష్మ.—మంచిసమయంబుననే మనము సంకల్పించితిమి.

(రుక్మియు, దుర్మిత్రుండును బ్రవేశింతురు).

రుక్మి-దుర్మి.—(నమస్కరింతురు).

భీష్మ-న్యాయ.—కుమారులారా! "కల్యాణమస్తు"(అని యాశీర్వదింతురు).

భీష్మ.—శిశుపాలాదిబంధువర్గంబునకుఁ గుశలమే?

రుక్మి.—అందఱు కుశలులై యున్నవారు. కాని, మీ రేదోకార్యాలోచనం బు సేయుచున్నట్టు లున్నది?

భీష్మ.—కుమారాగ్రణీ! మఱేమియు లేదు. అమ్మాయి వివాహవిషయంబు కన్న నిప్పు డొండాలోచన యేమున్నది? అందులకై నీయిష్టంబు గ్రహింప నుంటిమి.

రుక్మి.—ఓహో! ఇందుల కిప్పుడు నాయిష్టంబు గావలసివచ్చెనా? మదభిప్రాయంబు మీ రెఱుంగనిదియా! అయిన నీ విషయంబునకు నాయను భవప్రకార మాలోచించుపద్ధతి భవదభిప్రాయంబునకనుకూలించునా.

న్యాయ.—రాకుమారా! ముందు జనకాభిమతం బెఱింగి తన్మార్గం బవలంబింపవలయుఁగదా!

రుక్మి.—హితంబై మన్మార్గానుగతం బగునేని యవలంబించుట కభ్యంతర మేమి? దాని కిప్పు డింతత్వర యేల! తర్వాత నాలోచింతము.

భీష్మ.—తనయాగ్రణీ! అట్లు దలంపకుము.

ఉ. నేఁటిదినంబు కృష్ణు వరణీయునిఁగాఁ దగ నిశ్చయించి యీ
పాటికి భద్రలేఖనముఁ బంపఁగ నుంటి నిఁకేల తాళఁగఁ బా
పాటి మనంబునందు నెడఁ బాయక సమ్మత మూని మన్మనో
ధాటికి నడ్డుసేయక యథావిధిఁ గార్యము నిర్వహింపుమా!

తత్కార్యం బెప్పుడో యని తలంచెదవేమో!

ఉ. ఐదుదినంబు లుండె విబుధాళి విధించినలగ్నమింక నా
మీఁదిభరంబు నీశిరముమీఁదికిఁ బూనికఁ జేసినాఁడ స

మ్మోదముతో వహించి మనముద్దులబాలిక రుక్మిణీమణిన్
యాదవచంద్రుఁ డైనయల యబ్జదళాక్షునకే యొసంగుమా.)

రుక్మి.—సరిసరి! బాగుగనే యున్నది; నన్ను లేకుండఁ జూచి లగ్నంబు నిశ్చయించి, నీచకులుం డగుగొల్లనికి పిల్ల నిచ్చెదనని మహాగౌరవంబుగ జెప్పుచుంటివి. చాలుఁ జాలు, ఈప్రసంగ మింకఁ గట్టిపెట్టుము.

ఉ. అద్దిర! యీదురుక్తు లిటు లాడుట జెల్లునె యేటిమాటనీ
సుద్దులమారిగొల్లనికి సుందరి నీయు మటంచుఁ జెప్పఁగాఁ
బెద్దలు మెత్తురే? తగవె వెఱ్ఱితనం బన నిద్దిగాదె నీ
గద్దఱిమాట యొప్ప నిఁకఁ గర్ణముల న్వినవోప భూపతీ!

అదియునుంగాక యాతనికులగౌరవసంపత్పరాక్రమాదివిశేషంబు లెట్లు ప్రశంసార్హములో విందురుగాక;

ఉ. ఏలుటకా వసుంధర యొ కింతయు లేమ భుజించఁ దిండి యే
కాలము హస్తినాపురిని గాండివిపొత్తునఁగాని యింట లే
దాలమునందు గెల్పులు 'జి తోస్మి' యటంచునుబోవుగాని యే
మూలల నుంట లేదు తగ మ్రుచ్చిలుసొమ్మె ధనంబు వానికిన్.

న్యాయ.—మనుజేంద్రా! సాక్షాద్దేవవైభవుం డగుకృష్ణునకు నీచగుణవిశేషణంబు లితండు కల్పనంబు సేయుటగాక యివి సత్యంబులై యుండునా!

భీష్మ.—విదారితశత్రుం డగునవ్వాసుదేవుపక్షంబు మనంబున సహింపక నీచోపమలచే మనమనంబుల మరల్పఁ బ్రయత్నించుచు, దివ్యపురుషుని కృత్యముల నిందించుచున్నవాఁడు;

రుక్మి.—ఆతండు దివ్యపురుషుండా? దేవవైభవుండా? వృద్ధబుద్ధు లిట్లుండ వలెఁ గాకిం కెట్లుండును.

దుర్మి.—తారతమ్యంబుల పరిశీలనం బెఱుంగక, వృద్ధబ్రాహ్మణులవలన పురాణంబులు వినుచు, వారు జెప్పినపల్కులు వేదవచనంబులుగా భావించి

కాలస్వభావం బెఱుంగక యుండువీరితో మనకు వాదం బేల? ఆవిష
యంబున కీ వెంతమాత్రము సమ్మతింపకుము. (అనిచెవిలో రహస్యము
గాఁ జెప్పును).

రుక్మి.—ఆతనిజన్మంబు లోకంబునకు మృత్యుప్రాయంబై పరిపూర్ణశత్రు
మయంబై యున్నయది. ఎట్లనిన.

ఉ. పుట్టిననాఁడె దుష్టుఁ డని • పొంచివధింపఁగనుండె మామకాల్
మట్టిని సోఁక కున్నపుడె • మట్టియగల్పఁగ నుండె లేమ యే
పట్టును లేనివేళనె న • భంబున కెత్తిడె రక్కసుండు వీఁ
డెట్టివిరోధి ! వీనివలె • నెత్తరె జన్మము లెల్లమానవుల్.

అదియునుంగాక, వానికి, దినగండము నూ ఱేండ్లాయు వన్నట్లిప్పటి
కిని విరోధిగండంబు లపరిమితంబులై మనుగడ కడ్డుపడం జూచు మండె.
అందు మగంటిమి గల్గుశూరులు పెక్కండ్రు.

రుక్మి.—సీ. నరకాసురమృగేంద్ర • నరగర్జనము విన్నఁ
గృష్ణేభ మెట్టులుఁ • గెరలకున్నె,

దుర్మి.—మిత్రమా ! మఱియు.

మాగధశార్దూల • మహితరూపముఁ గాంచి
శౌరిమేషం బింకఁ • జావకున్నె,

రుక్మి.—చెలికాఁడా ! అంతియేగాదు.

శిశుపాలవైశ్వాన • రశిఖావళులఁ గన్నఁ
గంసారిశలభంబు • గాలకున్నె,

దుర్మి.—రాకుమారా ! అదియునుంగాక.

పౌండ్రకనామక • పవిధారసడిఁ గన్న
వనమాలిశైలంబు • వ్రయ్యకున్నె,

రుక్మి.- తే-గీ. మురనిశాచరవాయువు • ప్రోఁత కదలి
వాసుదేవాభ్ర మెల్లెడఁ • బారకున్నె
దుర్మి—రుక్మి యను గ్రీష్మభానుని • రుచి జనింప
నందపుత్రాంధకారంబు • డిందకున్నె.)

న్యాయ.—మానవేంద్రా! రణభీరువులను ధీరులుగను, ధీరుండగు కేశవుని భీరువుగను, రుక్మిదుర్మిత్రు లిద్దరును వర్ణించిరి. ఇట్టి దుర్గుణు లగు కొడుకులం గనుటకు మన మిరువుర మొక్కటియే తపం బాచరించినారము కాఁబోలు?

రుక్మి.—(కోపముతో) ఏమీ! అనుచితంబులుమాత్రము వచ్చిన మీ మర్యాదలు నిక్కముగా దక్కవు. కేశవుండు రణధీరుం డనియా? యుగ్గడించెదవు? (ఆతని ధీరత్వంబు చెప్పెద వినుము.

చ. బలుఁడును తాను మాగధుని • బారికి నోర్వఁగ లేక పోకిరిం
దోలఁగి భయార్తులై పఱచి • త్రోవను గానక చెట్టుగుట్టల
న్నెలఁగుచు చోరులంబలెను • నిల్కడ లేకయుఁ గొండ నెక్కి తా
రలసట దీరి యేఁగుట జ • రాత్మజుఁ డిర్వురఁ జూచియుగ్రుఁడై.

ఏమిచేసె నదఁ జెప్పెద వినుము.

చ. పరుగిడ కోరి! కృష్ణ బల • భద్రులు డ నిల్వు మటంచుఁ బల్కి న
త్వరగతిఁ జేరి చూడఁగను • పర్వతసంధుల డాఁగి రంతటన్
జరకొమరుండు తాఁ గినిసి • చావుఁడు శత్రువులార యంచు న
గ్గిరిశిఖిఁ జేర్చి కాల్పఁ దొడ • గెన్ దన సైనికులుబ్బియార్వఁగన్.

అంతట నమ్మగధరాజు తనసేనావాహిని మఱలించుకొని పురంబునకుం జనియెననియు కృష్ణుండు బ్రదికియున్నవాఁ డనిగూఢచారులవలన నెఱింగి తద్వధోపాయం బింకనువిచారించుచుండె ననియు నేను చేదిపురంబునకుఁ బోయిన

నాఁడే నామిత్రుం డగుశిశుపాలుండు నాతోడం జెప్పెఁగాన వాఁడు సుఖంబుగా నెక్కఁచోట నుండి తల దాఁచుకొనుటకై నను తగినశరణఁ బున్నట్లు తోఁచదు.)

ఆ-వె. బల్లిదుండు గాఁడు • పార్థివుండును గాఁడు.
ప్రల్లదంబు లెపుడుఁబల్కువాఁడు
ఇల్లులేనివాని • నల్లునిగా గోరి
చెల్లియలి నొసంగఁ జెల్లునయ్య.

భీష్మ—ద్వారకానగరపరిపాలకుండై సద్వంశజాతుం డగుగోవిందు నిట్లు పరిభవోక్తు లాడ నీకుఁ దగ దూరకుండుము.

రుక్మి—ఆపరిపాలనంబునకు మీరే సంతోషించవలెను !

తే-గీ. మగధనాథున కోడి యమ్మథుర వీడి
పిరివారిగృహంబులఁ • జేరఁబోవ
జారచోరుఁ డటంచును • జనులు దోలఁ
గర్మ మనుచును యావిశ్వ•కర్మఁ జేరి.

క. పగవారు దఱుమ వత్తురు
పగఱకనులఁ బడకయుండఁ • బాథోధిఁ గృపన్
నగరము నిర్మింపుము నా
కగణితగుణగణ్య శిల్ప•కాగమధన్యా !

అని వెక్కులు వినుతింప నాతండు దయావిశేషసాంద్రుండై సముద్రమధ్యంబున ద్వారకానగరంబు నిర్మించి యందుండు మనియానతిచ్చె. నంతియగాని స్వపురం బనియనుకొనుట కెంతమాత్రమును వీలులేదు. అది మనుష్యమాత్రులఁ నివసించుట కర్హంబైనదియుఁ గాదు.

రుక్మ—నీవు చెప్పినట్లు లాతండు మనుష్యమాత్రుండే యైనయెడల నక్కడ నెట్లుండును? దివ్యపురుషుండు గాబోలు? ఇల్లు లేదని చెప్పితివే? అది గృహం బనిపించుకొనదా యేమి?

దుర్మ—ఓహో! కుతంతును; ఆ సస్మైలోనివాండుగానే యున్నాడు.

రుక్మి—తమ్ముడా! నీకును గొంచెము పిచ్చి పట్టియున్నట్లే తోచుచున్నది. అతని కానగరం బెల్లకాలం బుండుననితలంచితివేని చెప్పెద వినుము.

ఆ-వె. హితముఁ గోరి శిల్పి♦ యిచ్చెఁగా నగరంబు
హితము దప్ప నతని♦కీయవలదె,

ఆ చెలిమియే తప్పక కేవలము సత్యహితుండై యతం డూరకున్నను;

నిండుపోటుదినము♦నీరధి పొంగినఁ
బురవరంబు మునిఁగి♦పోక యున్నె.)

రుక్మ—నీ వెన్ని చెప్పినను వ్యతిరిక్తంబులుగాఁ బల్కుటయే గాని నిజం బేమియుఁ గాన్పించదు. కృష్ణుని కేవల మధమాధమునిఁగా వర్ణించుచుంటివి. ఇంతట విరమించిన బాగుండును.

రుక్మి—అధమాధముండు గాక ఉత్తమపురుషుఁడా? ఎట్లు.

సీ. తల్లిదండ్రులు చెఱఁ♦దల్లడిల్లుచునుండ
వారింప కేఖలుం♦ డూరకుండె,
కరుణారహితుఁ డయి♦ కఠినకృత్యముఁ బూని
మాతులుఁ జంపె నే♦పాతకుండు,
గొల్లపొలంతుల♦ కొంపల దూఱుచు
నల్లరిఁ జేసె నే♦ ప్రల్లదుండు,
కల్లుద్రావెడువాని♦గాదిలితమ్ముఁడై
నీచవృత్తులను నే♦నీచుఁ డుండె,

తే-గీ. నట్టికుటిలుండు జడుఁడు కా • మాతురుండు
గుణవిహీనుండు భీరుండు • కుత్సితుండు
వాఁడు నేఁ డధమాధమ • వర్తనుండు
గాక యుత్తముఁ డెట్లగు • నాకుఁ జెపుము.

ఇంక నితండు దుష్టమానవుం డనినొక్కి వక్కాణింప ననేకనిదర్శనంబులు గలవు. వెదకిచూచినను ఒక్కసుగుణం బున్నదని నాయెదుటఁ జెప్పుము.

రుక్మర—కేవలతామసులముందర శాంతోక్తులీసమయంబునఁ బనికివచ్చునా? నిక్కముగాఁ బరిశీలింప నాతనికృత్యంబు లన్నియుఁ బావనంబులుగా నే యెంచఁబడును.

[తే-గీ. కార్తవీర్యార్జునుండు కే • కయబృహద్బ
లానవీంద్రులు శూరసే • నాత్మజుండు
మఱియు దమఘోషుఁ డాదిగా • మనుజవిభులు
యదుకులాబ్ధిఁ జనింపరే • యశముఁ గనరె.

అట్టి సద్వంశోత్తంసుం డగువసుదేవసూనుని నిందించుచు నాతని గొల్లం డనియు నధమాధముండనియు బెక్కులు ప్రేలుచుంటివి. అట్లు బల్కుట తగదు.

క. వసుమతిభారముఁ బాపఁగ
వసుదేవునిగర్భమందు • వైకుంఠుఁడు దాఁ
బసిబాలు డై జనించె త
పసిజను లగ్గింప దైత్య • పాళి తపింపన్.]

కృష్ణుండు విష్ణురూపంబునం బుట్టి తద్రూపంబు జననీజనకులకుం బొడసూపి ప్రాకృతబాలకుండయ్యెననియుఁ గంసభీతిచే వసుదేవుం డప్పాపనిం దెచ్చి నందభార్య యగుయశోదప్రక్కం బెట్టి యామెకూఁతుం గొని దేవకీదేవిప్రక్కం జేర్చెననియుఁ గృష్ణుం డిక్కడ నభివృద్ధి నొందుచు కంసవధోపాయంబు

జింతించుచుండె ననియు నిదివఱ కప్పుడప్పు డాతనిచరిత్రంబు నారదమునీంద్రుండు సెప్పుచుండ నీవార్త మిక్కిలి విచిత్రానందకరంబయ్యె నని మన మనుకొనియుండ నింతలోనే మఱచితివా? నీకు జ్ఞాపకంబు లేనియెడల న్యాయబుద్ధి నడిగి తెలిసికొనుము.

న్యాయ—అవునవును. రుక్మరథుండు జెప్పినది వాస్తవము. అతండు చిన్న వాఁడయ్యును జ్ఞానంబునం జేసి పెద్ద యనియే యెన్ననగు.

రుక్మి—ఇప్పుడు నీవుమాత్ర మందఱికన్నఁ బెద్దగా నుండలేవా? పనిపాటులులేక సన్యాసియై మఠంబులు సేవించుచు జగడంబులు పురికొల్పి కలహభోజనుం డని ప్రఖ్యాతి నొందిన యాటకాఱి మునిపల్కులు మీకు కేవల సత్యంబులై తోఁచుచున్నవి గాఁబోలు.

రుక్మర—అయిన నీవు జెప్పినవే సత్యంబు లనియా? మాకు నమ్మకము! వాసుదేవుండు దివ్యపురుషుండే కానియెడల.

సీ. అఱచేతులందు ను♦య్యాల లూఁగునప్పుడే
విషధరకుచఁ జంపి ♦ వెలయు టెట్లు?
శయ్యపైఁ బొర్లను ♦ చేయూనునప్పుడే
పరుగిడి బండిని ♦ విఱుచు టెట్లు?
పుడమిపైఁ దోఁగియా♦డెడునాఁడె యీసున
నెత్తినరక్కసు ♦ మొత్తు టెట్లు?
అడుగుల నిడఁ దడఁ♦బడుచు నుండెడునాఁడె
కుజముల ధరఁ బడఁ♦గూల్చు టెట్లు?

తే-గీ. ఎంచిచూడంగ నతఁడు ప్ర♦పంచ మెల్లఁ
బోషణము సేయఁ బుట్టిన♦ శేషశాయి
యంశయే గాక నరుఁ డని♦యనఁగఁ దగునె
ద్వారకాపురవాసుని ♦ వాసుదేవు.

భీష్మ—అట్టిమహానుభావుని ప్రాకృతపురుషుఁ డనిచెప్పుటకన్న వేఱ పాపం
బున్నదా? (రుక్మరథునివంకఁజూచి) రుక్మరథా!

చ. అదియునుఁగాక మన్నుదినె•నమ్మ సుతుం డని గోపబాలుర
మ్ముదితకుఁ జెప్పఁ దల్లి తన•ముద్దులబిడ్డనిఁ జెంపఁ గొట్టి త
ద్వదనమునందుఁ గాంచె నన•పర్వతవార్ధిదినేశచంద్రతో
యదవసుతారకాదియుత•మైతగుపద్మభవాండభాండముల్.

దుర్మ్మ—అదియొకవిచిత్రమా? పైత్యాధిక్యముచే నవి యన్నియుఁ దిరిగినట్లు
కనఁబడినట్లు నున్నట్లు తోఁచును. లేదు లేదు. కూరుచుండి యున్న
ట్లుండి కొందఱికి నిద్రపట్టును. అప్పుడీలాటివి! పగలు చూచినవస్తువు
లగుటచే స్వప్నమందైనను గాన్పించును. అందుచేతనే వీరిని వెఱ్ఱిగొల్ల
లనిపిల్చుచుందురు. వాఁడింద్రజాలవిద్యనేమో నేర్చినట్లున్నది. అది
గాక యేమైయుండును? ప్రాకృతుఁడేకాఁడా! కాకపోయిన నతని
కింత యవస్థ యెందుకు? శత్రుపుంజ మంతయు కడుపులోనే యు
న్నవారే? అట్లయినమేమును, గనఁబడియుంటిమా? ఓహో! యిది విని
మమ్ము మ్రింగివేయునేమో ?

రుక్మి—(నవ్వుచు) బాలకునినోటిలోపల నఖిలభువనంబు లున్న వనిచెప్పుట
యెంతవింత ?

న్యాయ—నోటికి వచ్చినట్లు మాట లాడిన నేమిలాభ ముండును!

ఉ. పండితవేద్యుఁ డంచు మది•భావన లేక[మదంబు నొంది యా
ఖండలుఁ డేడురాత్రులు ప•గల్లు శిలాన్వితవృష్టి ముంప వే
దండము పద్మ మెత్తుగతిఁ•దాఁ గిరిఁ గోటిని నిల్పి కాఁచెఁ గో
తండముఁ గోపకావలినిఁ•దద్దయు శైశవవేళనే జుమీ.]

దుర్మ్మ—(తనలో) వీ రొకరివెంబడి నొకరు మాపక్షంబులు పూర్వపక్షంబుల్లు
సేయుచున్నవారు. వీ రెన్ని సెప్పినను నా నెచ్చెలియెప్పటికి వినువాఁడు
కాఁగఁగా !

రుక్మరథ—అగ్రజా! వెన్నుండద్భుతబలపరాక్రమమహిమాతిశయసంపన్నుండు గాని వ్యర్థుండు గాఁడు. నీమతం బింకఁ జాలించి వివాహోద్యోగం బున కుద్యమించుము.

రుక్మి—మీరందఱు బలసోదరున కిత్తు మనిచెప్పుటచే శ్రేయస్కాములైతి రని యు, నేను వల దనిచెప్పుటచేఁ గీడుఁ గోరువాఁడ ననియు వెఱ్ఱియూహలఁ బడుచుంటిరి! ఈకల్లవేదాంతంబు లాడుటచే కాలహరణం బగు టయకాని కాఁగలదేదియు లేదు.

ఉ. అంతర మింత లేక యెను • రాడుచు నన్దుదారభావణల్
వింతలుగాఁగ నెన్నుచు శి • లీముఖతుల్యదురుక్తు లాడుచున్
పంతము మీఱ కృష్ణునకు • బాలిక నిమ్మనిచెప్పినంత నే
నంతస మంది యిచ్చుటకు • సమ్మతి నొందునె పేఁడు తమ్ముఁడా!

అదియునుంగాక ఇఁక నాదృఢప్రతిజ్ఞ వినుము.

ఉ. నింగి విఱింగినన్ ధరణి • నీరజమైనను వార్థు లేకమై
పొంగినఁ జంద్రభానులు గు • భుల్లని వ్రాలిన నష్టదిక్కులున్
వంగిన మేరుభూధరము • వ్రస్సిన మత్సహజన్ నింక నా
వెంగలి కీను నిక్క మిది • వేయువిధంబులఁ జెప్ప నేటికిన్.

భీష్మ—(తనలో)

ఉ. శీలము గల్గువాని యదు • శేఖరుఁ డై తగువానిఁ జందురుం
బోలుమొగంబువాని జిగి • ముద్దులు గుల్కెడివాని నీలపుం
డా లగుమేనివానిని బెం • డంగుభుజంబులవాని దేవకీ
బాలున కీఁ దలంప నని • పల్కెడు బేల ధరిత్రిఁ గల్గునే?]

(ప్రకాశముగా) ఓయి తనయా! ఇంతదృఢప్రతిజ్ఞ నేల చేసెదవు? తండ్రి నగునాయభీష్టంబు గ్రహించి నాహృదయంబున కుల్లాసం బొనర్పుము.

రుక్మి—అందఱిమనంబు లేకంబులై యానందంబు నొందఁదగినపనికిఁ బ్రయ

త్రించవలెనుగాని యొకరికుండిన నేమిలాభముండును ? ఇప్పుడు నీ కట్టి ప్రమోదంబులేక దుఃఖంబేమి యున్నది ? కృష్ణుండు మాత్రము నీకు కేవలముఖ్యుండై తక్కినవా రెవరును గాక యుండిరా ? అతని కన్న పురుషశ్రేష్ఠు లగు రాజన్యు లెందఱు లేరు? మీ కందఱికిం జూడ చూడ లోకంబులోనిఘనులందరు కురూపులుగాఁ గన్పించుచుండిరి గాఁబోలు !

రుక్మర—తండ్రిసంకల్పంబునకు విరుద్ధం బగునట్టిచెడ్డమతంబు నీ కెందుకు ?

రుక్మి—అగ్రజాభిప్రాయంబునకు విరోధం బగునట్టిమార్గంబు నీ కేటికి ?

రుక్మర—నాయది సన్మార్గంబు గా దని యెవ్వరిచేనైనఁ జెప్పింపుము ?

రుక్మి—ఊరక వెంబడిమాటలతో నేమిప్రయోజనము.

రుక్మర—అట్లుగాకున్న స్వతంత్రోక్తులతో నే గురునిర్దిష్టుం డగుకృష్ణునికన్న నింకొక్కపురుషునిఁ బేర్కొని యీసభ్యుల మెప్పింపుము !

రుక్మి—వీరేనా ? సభ్యులు !

భీష్మ—రుక్మరథా ! నీ వూరకుండుము.

న్యాయ—(రుక్మివంకఁజూచి) నీవు నిర్దేశించినపురుషుం డెవండో చెప్పుము.

రుక్మి—ఆహా ! చెప్పకేమి ?

న్యాయ—వినిమొద మిప్పుడే చెప్పుము.

రుక్మి—మీరు వినినను వినక పోయినను, నానిశ్చితుం డగుపురుషుం డతండే కదా !

న్యాయ—ఎవండు ?

రుక్మి:—

ఉ. అందముగల్గువాఁడుపృథులాహవశూరులగెల్చువాఁడుమా
పొందును గోరియుండి పొరపొచ్చెము లేకచరించువాఁడుసం
క్రందనతుల్యసంపదలు గల్గిసుఖించెడివాఁడు చేదిభూ
సుందరి నేలువాఁడతఁడె నూ శిశుపాలుఁడు మంత్రిసత్తమా

ఉ. చిన్నతనాననుండి యల చేదినృపాలుఁడు భర్తయౌను యీ
కన్నియ కంచు నేఁదలచి కార్యము సేయఁగబూనియేఁగితిక్
మొన్నటిరోజు తత్పురిని ముహూర్తము బెట్టిరి పెద్దలెల్లమీ
రన్నదినంబె లగ్నమది యంతయు మీ కెఱిఁగింపవచ్చితిక్.

గావున నన్యథా యోజింపక సకలసద్గుణబంధురుండును, అమానుషవిక్రముండును, సంపద్విరాజితుండు నగుశిశుపాలరాజన్యునకు మనకన్నె నిచ్చి పాణిగ్రహణం బొనర్పవలయుఁ గాన త్వరపడుఁడు?

న్యాయ—ఈవిషయంబునకేనా? చెప్పక చెప్పక మహాగూఢంబుగాఁ జెప్పితివి?

రుక్మర—ఈపురుషుని గుణరూపసౌందర్యాదు లెవ రెఱుంగనివి.

రుక్మి—నీవుమాత్రము చాలదెలిసికొంటివి. ఎవఁడో చెప్పినమాటలు వినివిష్ణ్వంశసంభూతుం డనియు, పరాక్రమశాలి యనియు ననుకొనుట కాతని చరిత్రముమాత్ర మెవరికి దెలియనిది?

భీష్మ—మహనీయుం డగు నాదేవముని నేల నిందించెదవు? మనకర్యం బీరీతిని బరిణమింప నొకరినన నేల?

(ఉపరిభాగంబు వీక్షించుచు)

ఆహా! అదిగో! కర్ణరసాయనం బగు వీణాగానంబు వినవచ్చుచున్నది? ఇతం డాదేవమునీంద్రుండు గాఁ దలంచెద (ఆలోచించి) అయ్యో! ఆఋషివర్యుం డేల వచ్చును? అంతసుకృతం బాచరించితి నే?

సేవ—రాజేంద్రా! ఆవచ్చునది నారదమునియే.

భీష్మ—(సంతోషముతో) ఏమి నాభాగ్యము! సేవకా! నిరంతరాయముగా వారిని విచ్చేయనిమ్ము.

సేవ—భాగ్యము (అనిపోవుచు)

రుక్మర—మాపాలిటిదైవంబే వారినిఁ బంపినట్లున్నది.

ధర్మ—ఓహో! ఇప్పుడే మెనుభూతమువలె దాపరించుచున్నాఁడే?

(గానము సేయుచు నారదుఁడు ప్రవేశించును)

నార.—సుగంధివృత్తము.

శ్రీరమామనోధవా! వి ♦ శిష్టభక్తబాంధవా
చారురత్నభూషణా ప్ర ♦ శస్తమానితోషణా
మారకోటిసుందరాతి ♦ మాన్యసత్వమందిరా
పారమార్థికాదరాన ♦ పాయిశౌర్యమేదురా.

(అందఱు పీఠంబులనుండి లేతురు. భీష్మకుండెదురుగాఁ జని తోడ్కొనివచ్చి సింహాసనాసీనుం జేయును.)

భీష్మ—మహాత్మా; నారదమునీంద్రా! వందనములు నమస్కరించును)

నార—మనోభీష్టసిద్ధిరస్తు (అనియాశీర్వదించును)

భీష్మ-తే. గీ. దేవఋషిచంద్ర మీరా రరు ♦ దెంచుటెల్ల
నద్భుతానందములు నాకు ♦ నానహిల్లె
నదును వేళల వర్షంబు ♦ లందికురియ
హాలికుల కెల్లసంతసం ♦ బబ్బినట్లు.]

మునీంద్రా! తావకదర్శనంబుచే నాజన్మంబు సార్థకంబై మద్గృహంబు పావనంబయ్యె. నన్నుకరుణించి మద్భావితార్థంబు ఫలింపంజేయుఁడు (అని కూర్చుండును)

నార—రాజేంద్రా! నేఁడు విచారగ్రస్తుండవై పరితాపంబు నొందుచున్నాఁడవు? అంతకారణం బేమి తటస్థం బయ్యెను.

భీష్మ—మునీంద్రా! అడుగఁదలచి నన్నడుగుచుంటిరి గాని త్రిలోకవృత్తజ్ఞులగుమీకు విశదముకాని దేమి యున్నది. వినవలతురేని నావిన్నపఁబాలింపుఁడు.

ఉ. భూరిమదీయపుణ్యమునఁ ♦ బుట్టినబాలను రుక్మిణీమనో
కోరికమీఱఁ గృష్ణునకుఁ ♦ గూర్చి వివాహము సేయనున్న

దారికి రుక్మి యడ్డుపడి • తా నల చైద్యున కీదలంచె నె
వ్వారును జెప్పిన న్వినఁడు వాఁ•డిఁక నేమిట మాననేర్చునో!

నార—(తనలో) ఎక్కడఁ జూచినను సద్వంశంబులం దొక్కొకకాలంబున కొక్కొకనిర్భాగ్యుండు బుట్టుచుండును. చెట్టుచెఱచుటకై కుక్కమూతిపిందెలు బుట్టు ననుసామెత రిత్తయా? కాదుకాదు! వీఁడు దుర్మతంబు గలవాఁ డని నాకు తెలిసియేయున్నది. నేనును కొంతవఱకు బోధించిచూచెద. (ప్రకాశముగా) (రుక్మివంక జూచి) రాజపుత్రా!

ఉ. చుట్టము లందఱుం గడమ•సూనచతుష్కము రాజువాక్య
ముం, గట్టిగఁ బూని యుండఁగను•కా దని చెప్పఁగ నేలనీకు నీ
పట్టినపంత మిట్టియెడ• భావ్యము గా దిఁక మానుమయ్య నీ
యట్టికుమారులయ్యనిటు•వ్యాకులమందఁగఁ జేయ నేర్తురే?

రుక్మి—చాలుఁజాలు! ఈనీతి కొంతవఱ కిదివఱకే నాకుఁ దెలిసియున్నది.

నార—అయ్యో! అట్లనెద వేల? శాంతబుద్ధితో వినుము.

ఉ. పెద్దలబుద్ధి కింపుగను• పెండిలి సేయుము నీదుసోదరిన్
ముద్దులుగాఱు నట్టినగు•మోమును గల్గినశౌరి కిచ్చి; యీ
ముద్దియకుద్ది యౌ నతఁడు

రుక్మి—(తలఁ ద్రిప్పుచు, మోము పెడవంకకుఁ ద్రిప్పును.)

నార— మోమటు ద్రిప్పెద వేల? యింక యే
రద్దియు లేక కార్యము బి•రాన యొనర్పుము రాకుమారకా!

రుక్మి—కార్య మొనర్చుట కింక నేసుందరపురుషులు లేకుండిరా!

దుర్మి—నారదా! మాసుందరి నా నారదదేహునకే యియ్యవలెనా?

నార—(తనలో) వీరికి దుర్మతంబే యభివృద్ధి నొందుచున్నది.
(ప్రకాశముగా) ఓభీష్మకపుత్రా!

తే-గీ. రాజకులపాంసనుండు దు•ర్మార్గుఁడైన
చైద్యునకు భైష్మి నిచ్చుట•జనునె నీకు

యజ్ఞముఖమునఁ గొన్నహవ్యంబు కుక్క
కిచ్చుగతి గాదె యాతని కిడుట చెపుమ?

అదియునుగాక, మొదటినుండి కృష్ణారోపితచిత్త యయినభవత్సహోదరి యభిలాషంబు రిత్తసేయుట యుత్తమబుద్ధి గాదు. కావున నాహితోపదేశంబు నవలంబించి యిష్టపడుము.

రుక్మి—మీ రిక్కడినుండి మర్యాదగాఁ బోవుట పొసంగదు గాఁబోలు! పరేంగితం బెఱుంగక పల్కు మీరలేనా ముక్తిని సాధించువారలు?

ఉ. వచ్చినవారు మాదృశుల వందనముల్ గ్రహియింపవచ్చు తా
రిచ్చురు వచ్చు కామ్యము లిలేశులచేఁ బడయంగవచ్చు గా
కిచ్చకముల్ వచించుచు మదిచ్చకు నడ్డుపసాళ్లు సెప్పఁగా
వచ్చెనె నీకు తాపస! రవంతయు నింగిత మొప్పఁ జెల్లదే!

నార—మా కది తెలిసియేకదా! తగుధర్మంబు సెప్పవచ్చుట.

రుక్మి—నీధర్మంబులును నీవినయంబులును మాకడ నెంతమాత్రముఁ బనికిరావని యెఱుంగుము.

చ. తగుదు నటంచు లేచి బహుధర్మ్యపుఁబన్నము లుగ్గడింపఁగా
నగు నగు నౌ నటంచుఁ దలలట్టిటు ద్రిప్పెడువారు లే రిటన్
జగడమె యన్న మైనెగడు సాధువు లిట్టిహితోక్తు లాడఁగా
మగువలు వింద్రుగాక మగమానిసు లిక్కడ విందురే మునీ!

ఇంతకుము న్నిక్కడ జరుగుచుండువానికంటె యనుచితంబులు నీనోట నుండి వినంబడె. శిశుపాలుండు దురాత్ముం డనియు, రాజకులపాంసనుం డనియు భవాదృశులు బల్కినంతమాత్రంబున నె యాతనిపదవికి తక్కువ యగునా?

రుక్మర—పెద్ద లగువారిని యోజింపక మాటలాడుట సమంజసంబు గాదు. కావున విధేయతగాఁ బ్రసంగింపవలయు.

రుక్మి—అవును. నిన్ను జూచియే మాటలు నేర్చుకోవలెను.

నార—(కోపముతో) ఇంగితం బెఱుంగననియు, నాపలుకులు మగువలు వినవలసినవనియు, నన్ను పరిహాసంబు సేయుదువా? రాజాధముం డగు శిశుపాలునిఁ బ్రస్తుతించుచు, నన్ను పూజింపవలెనాయేమి? నీబోంట్లస్వల్పబుద్ధులు నేఁ జెప్పుపల్కుల నట్లుగా కింకెట్లు భావింతురు?

చ. అతులతపోనిధుల్ కను మహాత్ములటంచును గొంకులేక దు
ర్మతిని మదోగ్రవృత్తిని నిరాకరణోక్తుల నక్షహసింతువే?
క్షితిపకులాధమా! నను సహించనుగా నెదలోఁ దలంతె? సన్
న్నతిలఘురీతిఁ జూచుట త్వదాయువు మూఁడుటఁ గాఁ దలంచుమా.

అదియునుంగాక.

జగత్త్రాణపరాయణుం డగు శ్రీకృష్ణుని, దైవసమానుండగు జనకుని, తపోమహిమావిశేషుం డగు నన్నును, శత్రుబుద్ధితోఁ జులకనగాఁ జూచునీకుఁ దుదికాలం బాసన్నం బైయున్న దనియెంచుకొనుము.

భీష్మ—మహాత్మా! తాపసేంద్రులయాగ్రహంబున కే మెంతవారము. కరుణారసదృష్టిం జూడుఁడు.

రుక్మర—మునీంద్రా! అపరాధంబుల క్షమింపుఁడు.

దుర్మి—(చేతులుజూపి) ఈవెడగుమునియు నాగోపాలుండును లోకంబుల శాసించుదొరలాయేమి!

రుక్మి—ఈసమయంబున శిశుపాలజరాసంధాదివీరు లుండిన వీనిమహిమంబు లిప్పుడే యెఱుకపడియుండెడివి.

నార—ఏమీ! యింతదనుక న్యాయవంతుం డగుభీష్మకునిసద్భక్తియు, రుక్మరథునివిధేయతయు నిన్ను గాపాడిన వనితలంచుము. శిశుపాలజరాసంధు లంటివి? వారుమాత్రము నీకన్న ముందే నశింపక యెట్లుందురు?

అర్ధాయుష్మంతుల నాకడఁ జేర్కొనెదవేమి? ఏమీ! వారు న న్నేమిచేయుదురో చెప్పుము.

రుక్మి—అందఱిబ్రతుకులకొలంది నీ వేమి చూచివచ్చితివా ?

నార—వారిబ్రతుకులు నే నెఱుంగనివియా? నీకూర్మి చెలికాఁ డగుశిశుపాలు నివృత్తాంతం బెప్పుడైన వింటివా ?

రుక్మి—అది వినియైనను దుర్మతము మానునేమో. మునీంద్రులు కరుణచే సెల విండు.

నార—చెప్పెద వినుండు.

ఆ. వె. పుట్టినపుడు నాల్గు ♦ భుజములు కనులు మూఁ
డుంటఁ జూచి తల్లి ♦ యులికిపడఁగ
గగనతలము నుండి ♦ ఘనశబ్ద మొక్కటి
వినఁగబడియె నతివ ♦ వీనులకును.

ఆశబ్దం బేమనిపల్కెనన.

తే. గీ. ఎవ్వఁ డీపసిబాలకు ♦ నెత్తికొనిన
నధికభుజములులోచన♦మనవిమీఁద
నూడఁ గల్గెడి నో యట్టి ♦ వాఁడె వీనిఁ
జంపగల్గినమేటి ని♦జమ్ము నమ్ము.

అనిన విని శిశుపాలునిజనని యగుసాత్వతి కుమారహంత యెవ్వండో యెఱుంగఁదలంచి బిడ్డ నెత్తికొనఁ బ్రతివారి కిచ్చుచుండె. నప్పుడు బలరామకృష్ణు లిరువురు తమమేనత్తం జూడఁదలంచి వచ్చిన నత్తవ్వి తన పుత్త్రుని వాసుదేవున కొసంగిన నాక్షణంబ మిగిలినరెండుభుజంబులును, ఫాలనేత్రం బూడి క్రిందఁ బడినం జూచి సాత్వతి దుఃఖిత యై యున్నం గాంచి హరి దయామయుండె.

తే. గీ. నీకుమారుండు నాచేత • నిహతుఁడగును
తండ్రిసోదరి నైతిపి • దానఁ జేసి
తప్పులను నూఱు గాచెదఁ • దథ్యముగను
నెక్కుడైనను వాని నే • నుక్కడంతు.

అనిచెప్పి వారునుం జనిరిగాన నట్టియాయుర్విహీనున కాదిగర్భేశ్వరి యగు వైదర్భి నిత్తు నని చెప్పు నిర్భాగ్యుఁ డెవఁడు గలండు? (రాజువంక జూచి) రాజా! భీష్మకా!

ఉ. పంచపాది.—
ఏనిపదాంబుజంబుల ను • మేశుఁడు పద్మభవుండు నాశచీ
జానియు మానసంబుల న • జస్రము నిల్పి భజించి నిత్యసౌ
ఖ్యానుభవంబు గందురో శు • కాదిమునీంద్రసమాజమెల్ల నె
వ్వానినిఁ బొందిమోక్షపద • వారధి మున్గుచుఁ దేలుచుండునో
వానికి నీతనూజ నిడి • వర్ధిలు మోనరనాథచంద్రమా!

రుక్మి—ఓకపటిలమునీ! ప్రొద్దుటనుండి యేమేమొ వాగుచు, సరిపడనిసంగతులన్నియుఁ గల్పనంబు చేసి నీపాండిత్య మంతయు నిక్కడ వెళ్లడించుచుంటివి. అందఱచావుబ్రతుకులసంగతు లన్నియుఁ దెలిసినట్లును నీవే బ్రహ్మవనియుఁ బొంగిపడుచుంటివి. ఆయన యిచ్చువాఁడును నీవు యిప్పించువాఁడవు నేఁటికి దిగ వచ్చితిరి. ఇఁక మీమర్యాదలు నిక్కముగా దక్కవు.

న్యాయ—ఎంతసెప్పినను వినఁడిదియేమికర్మమో?

భీష్మ—(రుక్మిదగ్గఱకువచ్చి) కుమారా!

చ. మునివరుమాటలన్నియున • మోఘములై శుభదాయకంబులై
చన నిటుమూర్ఖువింబలెను • సాహసమొప్పఁగనుండఁ బాడియే

తనయ దురాత్మునకై తనరి•తద్దయు నాయువులేని నాకిక్
మనకులవర్ధనిక్ సరస•మంజులభాషిణి నీయఁ జెల్లునే?

[ఆ-వె. అఖిలకామదుండు • నంచితసత్త్వుండు
విమలయశుఁడు నింద్ర • విభవుఁ డార్త
భువనసుందరుండు పూజ్యుండు కృష్ణుఁడే
వరుఁడుగాక యితర•వరులు తగరు. ]

గావున కృపాసముద్రుం డగునీమునిశార్దూలుని మాటలు వినుము.

రుక్మి—ఆయనయే గాదు సత్యలోకంబునుండి యాతనితాత దిగివచ్చినను విను వాఁడఁగాను. పిచ్చిమాటల నమ్మి నీవును పెడత్రోవం బడిపోవుచుంటివి. శిశుపాలుని కర్థాయుష్యంబఁట. ఈచెనఁటిమాటలు శిశుపాలాదులు విన్నచో నీతనిపూర్ణాయుష్యంబు బయటఁబడును.

నార—ఓరీ! దుర్మార్గా! ఏమికూసితివి? (అని జటనొకదానినిఁ బెఱుకఁ బ్రయత్నించును)

రుక్మర-భీష్మ—మునివర్యా శాంతింపుఁడు (అని పాదంబులపయిం బడుదురు)

నార—నన్ను నివారింపవలదు. వీని నిప్పుడే నంతకాలయంబున కనిచెద.

భీష్మ—మహాత్మా! క్షమింపుఁడు.

నార—ఇంక నెంతమాత్రము క్షమించువాఁడఁగాను.

భీష్మ—(రుక్మివంకఁ జూచి) పుత్రకా! తొల్లి జగదభిరాముం డగుశ్రీరాముని రీతి పితృవాక్యపాలనం బాచరించి యవ్యయం బగుకీర్తి సంపాదింపుము.

రుక్మి—ఓహోహో! అటులనా? జన్మజన్మంబుల నాకట్టిదుఃఖభాజనం బగుకీర్తి లేకపోఁగాక. అతండును వృద్ధుమాట వినుటంబట్టియేకదా! తుదలేనిదుఃఖంబుల కాస్పదుండయ్యె.

భీష్మ—(కొడుకువంకఁ జూచి)

మత్తకోకిలావృత్తములు—

నీతి సెప్పెడుమానిపల్కుల•నేర్పుగా మది నుంచుమా
యాతఁడే శరణం బటంచుఁ ద•దాజ్ఞ మౌళి వహించుమా

రుక్మి—తండ్రివంకఁజూచి)

నాతలఁపలచేదిభూపతి•నమ్మె నంచుఁ గ్రహించుమా
యీతపస్విమృషోక్తుల న్విన•నే నటంచుఁ దలంపుమా.

రుక్మర—(అన్నవంకఁజూచి)

శీతభానుముఖిన్ సులక్షణ•శ్రీపతిం దగఁ గూర్పుమా
ఖ్యాతిభూతియు గల్గి సౌఖ్యము•గాంతు మంచును నమ్ముమా

న్యాయ—(రుక్మివంకఁజూచి)

భూతవాసుఁ డఖండు డాశ్రిత•పోషకుండతఁడే సుమా
పూతనాంతకునిన్ సహోదరిఁ•బొందొనర్చి సుఖింపుమా

దుర్మ—(రుక్మితో)

ఆతతాయి జనుండు కృష్ణుఁడ•టంచు నీమది నెంచుమా
నాతిఁ జంపినవాని కిచ్చుట•న్యాయ మెట్లగుమిత్రమా

నార—(భీష్మకునితో)

పాతకుండు దురాత్ముఁడీ తనిఁ•బ్రస్తుతింపఁగ భావ్యమా
నీతిహీనునితోడిమాటలు•నిల్పు మోనృపచంద్రమా.

(రుక్మివంకఁజూచి) నీజనకునభిమతంబు నెరవేర్చుట మంచిదిసుమా?

రుక్మి—మునీంద్రులు పాతకులతో సంభాషించువారు కారుగదా?

నార—అవును. సంభాషించఁగూడదుగాని దుర్మతము వీడువలెనను హితము
జెప్పుచుందుము. విననిచో శాపనిహతులం జేసెదము.

రుక్మి—దుర్మతంబుగల వారిక్కడ నీకన్న నెవరుందురు. మితముదప్పి మాట
లాడిన నిక్కడనుండి వెడలింపుదు నని తెలిసికొనుము.

నార—మూర్ఖా! మాన్యావమానీ! ఏదీ చూతము వెడలించుము.

రుక్మి—అందుకు సందియం బేమి. ఇప్పుడే వెడలించెదను (అని వైకిదుముకఁ
బోవును)

భీష్మ-రుక్మి—(మధ్యను చేరి రుక్మిని చేయిఁబట్టి యావల తీయుదురు)

భీష్మ—(నారదునివంకఁజూచి) మునీంద్రా! రక్షింపుఁడు. (అని పాదంబు లపయింపఁబడును)

నార—(శాపోదకంబులు గ్రహించి)యీకోపానలంబున నిన్నిప్పుడే దగ్ధంబు గావింపఁ జాలుదును. నీజనకుని సద్గుణంబులచే నుపేక్షించితి. అయినను శీఘ్రకాలంబుననే మదీయశాపఫలంబు నీవు సంభవించుఁగాక

తే-గీ. మదము మీఱఁగఁ గృష్ణుని యదుకులంబు
నిందఁ జేసి మదుక్తుల నిగ్రహించి
తీవు హార్యగ్రజునిచేతఁ జావు మింక
నట్టికాలంబు యుద్ధంబు నావహిల్లు.

(తెరలో సత్యము. సత్యము. సత్యము. అని ధ్వని వినంబడును.)

భీష్మ—నావంశంబునకు నేఁటి కెంతవింతకార్యంబు వాటిల్లె? అకటా! పుత్రకా! తపోధనుపాదంబులు శరణనుము.

రుక్మి—నీవనినమట్టుకు చాలును. ఊరకుండుము.

భీష్మ—(తలవంచి దుఃఖపడును)

న్యాయ—రాజా! ఇప్పుడు చింతనొందిన నేమిఫలము? పురాకృతపాప రూపంబె మనకుఁ బుత్రరూపంబులయ్యె ననియెఱింగి శాంతింపవల యును.

నార—విదర్భేశా! నేను పోయివచ్చెదను. నీమనంబునందుండువగఁ దొఱం గుము. మీఁద నీకు శుభంబగును నమ్ముము.

భీష్మ.—దేవా! యనుగ్రహ ముంచుఁడు.

నార.—(తనలో) నే నీక్షణంబ ద్వారకకుం జని యీవృత్తాంతంబు బలరామ కృష్ణుల కెఱింగించి వారిం బ్రోత్సాహపఱిచెద. (ప్రకాశముగా) నే నిదే పోవుచున్నాఁడ. (అనిపోవును)

రుక్మి.—(దుర్మిత్రునితో) ఈనారదునికీతింజూడ ద్వారకాపురికిఁ బోవు

నట్లులు తోఁచుచున్నది. అయిననేమి? మనపురోహితపుత్రుండగు మిత్రవిందుని రప్పించి చేదిపురనాథుండగుశిశుపాలునికి శుభలగ్న పత్రికనంపుము. ఈకమ్మ శిశుపాలున కిమ్మనుము. (అనిజాబు నతని చేతికిచ్చును)

దుర్మి.—చిత్తము (అని నిష్క్రమించును.)

రుక్మి.—సేవకా! పురంబు శృంగారంబొనర్చునటులఁ జాటింపం బంపుము.

సేవ.—అయ్యా! చిత్తము. (అనిపోవును)

రుక్మి.—(నిష్క్రమించును)

భీష్మ.—మంత్రీ! ఇంక మనప్రయత్న మేమి యున్నది.

న్యాయ.—మఱేమియు నాకుం దోఁచకున్నయది.

రుక్మ.—మనమిప్పుడు ద్వారకకు సమాచారంబు జేయుటవలనఁ దప్పేమి యున్నది.

భీష్మ.—(ఆలోచించి) రహస్యముగా కబురంపవలసినదేకదా?

రుక్మర.—రహస్యమేమి? వెల్లడించియే పంపుదము.

భీష్మ.—అ ట్లింతమాత్రమును వలదు. అది కలహంబునకుఁ గారణంబై యుండును.

రుక్మ.—చేదపురసమాచారంబు విననపిదప అమ్మాయి రుక్మిణి బ్రదికియుండినఁ గదా యాలోచించుట.

న్యాయ.—ఆర్తజనరక్షకుండును, సర్వజ్ఞుండగు దేవుండు దేవకీపుత్రుఁడైన యెడల నన్నియోజనలు చక్కఁబడును.

భీష్మ.—కాక మన మేమిచేయుదము.

రుక్మర.—ఇన్నిఁటికిని విధిలిఖితం బెట్లో యట్లు కాఁగలదు.

న్యాయ.—రాజా! ప్రొద్దుపోయినది. కొలువు చాలింతమా?

భీష్మ.—అవును. పోవుదము. (అని అందఱు నిష్క్రమింతురు).

ప్రథమాంకము ముగిసెను.



శ్రీ ర స్తు.

శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణే నమః.

# రుక్మిణీ పరిణయము.

## ద్వితీయాంకము.

---

స్థలము—చేదిపురమున శిశుపాలసభాభవనము.

(శిశుపాలుఁడు సింహాసనాసీనుఁడైయుండును. జరాసంధుఁడు, దంతవక్త్రుఁడు, సాళ్వుఁడు, పౌండ్రకవాసుదేవుఁడును ఒకరివెంట నొకరు ప్రవేశింతురు).

శిశు.—అయ్యారే! నేఁ డెంతసుదినము! ధీరులగు స్నేహితుల నందఱ నొక్క-వడిఁ జూడంగలిగె. మిత్రవాత్సల్యం బని ట్లుండవలెఁగదా! (అని యందఱ కెదురేఁగి తోడ్కొనివచ్చి సింహాసనస్థులం జేయును.)

జరా.—సాత్వతీసుతా! ఇంతలో మమ్మందఱను శీఘ్రింబు రమ్మనిపంచిన కారణం బేమైయుండును.

శిశు.—ఇప్పుడు వివాహవిషయంబునకన్న నెక్కు-వకారణం బేమియున్నది?

జరా.—ఎల్లుండిగదా లగ్నము. దీని కింతత్వర యేల?

శిశు.—మనమందఱ మిక్క-డనుండియే కుండినపురంబునకుం బోవలయు నని నాయభిప్రాయము.

జరా.—ఎట్లైనను మేమందఱము రాఁదలంచుకొనియున్నవారమేగదా?

శిశు.—మొన్నటిదినంబు రుక్మికిని, భీష్మకాదులకును, చాల వివాదంబు జరిగినదఁట.

జరా.—ఏమిసమాచారమది నీ కెట్లు తెలిసె?

శిశు.—లగ్నపత్రికఁ దీసికొనివచ్చినబ్రాహ్మణుం డగుమిత్రవిందుండు చెప్పె.

జరా.—ఏమని?

శిశు.—ఇట్లు.

తే. గీ. సాల్వతేయున కిత్తును•సరసిజాక్షి
నను చు రుక్మియు వల దంచు•నతనిగురుఁడు
ననుజుఁడును నారదుండును•ఘనవివాద
కలితులైయుండ నావల•కలహమాని.

తే. గీ. నీవు నేనును రుక్మియు•నీచుల మని
నాకు రుక్మిణికన్యక•నీకు మనియు
దూషణోక్తులు బల్కియుఁ•మదకు శాప
వశగతునిఁ జేసె రుక్మిని•పాపమాని.

దంత.—ఆగెచ్చులమాని కింతకావర మెచ్చినదిగా (అనిమీసములు దువ్వును)

సాళ్వ.—ఆమాయతపసి యింక నాకనులం బడినఁగదా వానిమహిమంబు బయటఁబడును.

పౌండ్ర.—నారదుం డెప్పుడుజూచినను నాకడ బహువినయంబుగా చమత్కారంబు సేయునేగాని,యధికప్రసంగంబు సేయఁడే? ఇంతగర్వించుట కతని కాయువుమూఁడెఁగాఁబోలు!

జరా—రుక్మిపక్షంబు వారకడ లేమిచే నిచ్చకువచ్చినట్లు ప్రేలెనుగాని, కానిచో నాయెదుర నిలచి పెదవిగదుర నాతో మాటాడఁగలఁడా? మంచిది వాఁడు కృష్ణుని కేమైనసమాచారంబు జేసియుండునా?

శిశు—చేయకేమి? కొడుకుమాటలకు లోఁబడి భీష్మకుం దూరకుండినను నారదుం దూరకుండునా? రుక్మి నాకు నంపిన యీరహస్యలేఖనంబుఁ జిత్తగింపుము. (అని జాబు చేతి కిచ్చును)

జరా—(చదువుకొనినట్లు చూచి) పాపము. దీనిం జూడ రుక్మి మనరాక కెదురు జూచుచు మనస్స్వాస్థ్యంబు లేకయుండు ననితోఁచెడిని.

పౌండ్ర—ఆజాబునం దేమివిశేషంబులో?

జరా—ఇదిగో(అనిపౌండ్రకునిచేతికిచ్చి) రుక్మియభిప్రాయం బాకడపటిపద్యంబువలన తేటతెల్లముగాఁ దెలియును చూడుము.

పౌండ్ర—అవును. ఈపద్యంబువలన వివరంబుగాఁ దెలియఁగలదు.

సాళ్వ—ఏ దేదీ? చదువుము.

పౌండ్ర—

చ. చెడుముని యేఁగి యిచ్చటివి॥శేషము లన్నియుఁజెప్పి కృష్ణు
నిన్, గడువడిఁ బంపు నంచు మదిఁ॥గుందెద సంగడికాఁడ
యుద్ధమే, ర్పడియెడు నంచుఁ దోఁచెడు భ॥వత్ప్రియమిత్రు
లు మాగధాదులా, పుడమి దొరల్ సహాయమును॥ పొఁ
దఁగ వేగమె రాఁగ గోరెదన్.

జరా—పౌండ్రకవాసుదేవా! రుక్మికి మనయం దుండుభక్తివిశ్వాసంబులు మిక్కిలి కొనియాడఁదగినవి.

పౌండ్ర—అందుకు సందియంబుగలదా?

జరా—దమఘోషనందనా! ఆ యాదవుమూఁక వచ్చు ననినీమనంబున జంకుగలదాయేమి? ఒకవేళ వచ్చినను నాయెదుర నిల్చి బ్రతికి పోఁగలరా?

ఉ. భూమిని దూఱిన న్వనధిఁ॥బొందినఁ గొండలలోన డాఁగినన్
భీముని ప్రాపుఁ జొచ్చిన ది॥విం బ్రచరించినఁ బ్రాణభీతి సం
గ్రామమునందుఁ బాఱినను॥కంసవిరోధిని వెంట నంటుచున్
మామకశస్త్రరూపకధ॥నంజయకీలల మాడ్చెద న్జుమీ.

పౌండ్ర— ఓయి సాత్వతీతనూజా! సంగరభీరువు లగునాభీరులు వచ్చి-

నాబారినిఁబడి తప్పి పోఁగలరా? వాసుదేవాఖ్య నాయందుం బ్రవ
ర్తిలుచుండఁ వాఁ డెక్కడివాసుదేవుండు?

ఉ. సంగరరంగమందు భుజ♦సారములర్వఁగ బాణవృష్టిచే
తం గడువైరిసైన్యము వి♦తాకును జెందఁగ ముంచి శత్రులం
బొం గడఁగించి యంతకుని♦పొంతకుఁ బుచ్చి విదర్భరాజక
న్యాం గుణధన్య నీకుఁ బ్రియ♦నాయికఁ గా నొనరింతుఁ
జూడుమా.

దంత—సుగుణధౌరేయా! సాత్వతేయా! యాగోపాలకునిరూపడంచుటకు
నీపాంఁడ్రకాదులేల? నే నొక్కఁడనే చక్కసేయఁగలను.

తే. గీ. వృష్ణివీరులు వచ్చిన♦వీరకఁ దాఁకి
నిశితశరములు సంధించి♦నీ టడంచి
హాలిసహోదరుఁ బ్రాడున♦నంటఁగట్టి
పరిభవించెదఁ జూడు మో♦పార్థివేంద్ర!

సాళ్వ—చేదిపురపరిపాలా! శిశుపాలా! మదీయనామంబు విని బలరామా
నుజుండు విదర్భదేశంబు సొచ్చునా?

ఉ. చిందఱవందరై రిపులు♦చేవయుఁ దక్కి తొలంగి పాఱఁగా
నందతనూజు నెల్లరుఁ గ♦నంగ శిరంబు కరాసిధారచే
తం జెగవ్రేసి రాముని హ♦తం బొనరించి చెలంగి రుక్మి కా
నందము సంధిలంగ లల♦నామణి నీకొడఁగూర్తుఁ జూడుమా.

మఱియు సాత్యకి కృతవర్మ బృహద్బలాదు లెక్కుడుబలంబు గలవారైన
నను నే నొక్కండనే యుక్కడంచెద.

శిశు—(తనలో) నేనిప్పుడుగదా సఫలీకృతమనోరథుండనైతి నింక నామనం
బునకుఁ గొఱత యెయ్యది (ప్రకాశముగా)

ఉ. నాలుగు వార్థులో యనియ•నందగి ధీరగుణైకవాక్యముల్
గ్రాలఁగఁబల్కి నాదుహిత•కార్యముఁ దీర్పఁగనున్న మీసరిం
బోలెడుశూరవర్యు లిఁక•భూమినిఁ గల్గరు మిత్రులార వే
వేలు జోహారులొనర్చెదను•భీష్మకకన్యక నాకుఁ గూర్పరే.

జరా—ఇక్కార్యంబు సాధించుట మా కొక లెక్కయగునా? కృష్ణాదు లగుయాదవులే కాదు. వారికి సహాయముగా బలభేదిప్రముఖు లగు త్రిదశగణంబులు వచ్చినను కదనంబున వారిమద మడంచి విదర్భపుత్త్రిని నీసదనంబునం జేర్చి నిన్ను మెప్పించెద.

శిశు—మీయంతటిఘనులు నాకు మిత్రులైయుండ నాకు సాధింపరానికార్యంబు గలదా?

ఉ. ఘోరవిపద్దశాబ్ధిఁ బడి•కుందెడుసంగడికాండ్ర కెల్ల నా
ధారముగాఁగ నావలవి•ధంబునుబూనుచుఁ దాఁట జేయుచున్
భూరిసుఖంబు లీయఁగల•పుణ్యులు మిత్రులుగా రె వారి కె
వ్వారును సాటి రా రిలను•భావమునం బరికించిచూడఁగన్.

నే మీకుఁ జెప్పరానిదియు మీరుచేయఁజాలనిదియు నేదియు లేదు గావున నిక్కార్యంబు నాదిగాఁ దలంపక మీయదిగా భావించి పరిసమాప్తి నొందింపవలయు.

జరా—సకలసంపద్విరాజితయశోధురంధరుండ వగునీకు పరమమిత్రుల మైన మేము సహాయ మొనర్చు టిదియొకఘనమైనయుపకృతియా. రిపుపరాభవంబును మిత్రవిజయంబు నొనర్చుట కిది మంచిసమయంబు తటస్థించె నదియునుంగాక లోకంబున.

ఉ. సంపదవోవ బందుగులు•సద్మము చెంతకు రారు చూడఁగా
నింపగునట్టిమార్గమున•నేఁగమి సేవకు రాదు భార్యయున్
గుంపెడుబిడ్డలున్నను మనోవశవర్తులు గా రొకప్పుడున్
సొంపుగమిత్రుఁ డొక్కరుడె•జూవిడనాడనివాఁడుధాత్రిలోన్.

గావున మిత్రధర్మంబిట్లు ప్రవర్తిల్లుచుండ మమ్మీర్వువిశేషప్రశంసజేయవలెనా? నీమనఃస్థితం బగుకార్యం బౌనప్పుటకు సర్వసిద్ధంబై యున్నారము.

శిశు—(తనలో)

చ. సమరముఁజేసి శత్రువుల•జంపి విదర్భునిపట్టినే వివాహము
నరయంబుగాఁ గొని సం•హాయులు మత్ప్రియమిత్రకోటికిన్
ప్రమదమువిూఱ మన్ననల•పారముగా నొనరించి భైష్మితో
విమలమనంబుతోడఁగడు•వేడుక ముచ్చటలాడు టెన్నఁడో?

(ప్రకాశముగా) ఇంక నాబుద్ధికి సందియం బెందుకు. దిగ్గజంబులభంగి శూరాగ్రేసరు లగునామిత్రులు నల్వురు సేనాసమన్వితులై వచ్చుచుండ నేదలంచినతలంపు ఫలింప కెట్లుండును? స్నేహితులారా! ప్రయాణసన్నాహంబున కింక నాలస్యంబెందుకు?

జరా—గోపాలుండు కుండినపురంబునకు వచ్చుటకుమున్న మనమక్కడ చేరి యుండవలెను. అట్లుగాక వారేముందువచ్చిన కార్య మెట్లుపాటిల్లునో గాన నిప్పుడే పోవలయు.

శిశు—అయిన నట్లే చేయుదము. మీమీచతురంగబలంబుల సన్నద్ధంబులు గావించుటకు దండనాథుల కాజ్ఞ నొసంగి సిద్ధంబు జేయించుఁడు. (సేవకునివంకంజూచి) సేవకా! మనసైన్యంబాయత్తంబు సేయునటులం జెప్పి రథంబు శృంగారించి తెచ్చునటుల సారథికిం జెప్పుము.

జరా—పౌండ్ర, దంత, సాళ్వ—సైన్యంబు సిద్ధము సేయించుచుము రమ్మ.

శిశు—పోవుదము(అని అందఱు నిష్క్రమించెదరు).

ద్వితీయాంకము ముగిసెను.



శ్రీ ర స్తు.

శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణే నమః.

# రుక్మిణీ ప రి ణ య ము.

## తృ తీ యాం క ము.



రుక్మిణీదేవియంతఃపురము.

రుక్మిణియు, చంద్రకళయు నుందురు.

రుక్మిణి—(కృష్ణపటంబు హస్తమందుంచుకొని) చెలీ! చంద్రకళా! ఈయనంగరూపలావణ్యతేజోరాశి యగుసుందరాంగుని నీపటమునందు జూచినప్పుడే యింతమనోహరంబుగ నుండెనే! ఆతనిం బ్రత్యక్షంబున గాంచినచో నామనం బెంతపారవశ్యంబు నొందునోకదా?

చంద్ర—సఖీమణీ! రుక్మిణీ! జగన్మోహిని వనివన్నెకెక్కిననీవుమాత్ర మంతకన్న తక్కువసోయగంబు గలదానవటమ్మా!

రుక్మిణి—నన్నంత యెగతాళి చేయవలెనా. అంత యెక్కువగ నున్న నీచక్కదనము నీయొక్కనే యుంచుకొనుము.

చంద్ర—వైదర్భి! యిం దెగతాళి యే మున్నది. నీకు నీప్రియుండే యెక్కువయినయెడల నంతకన్న నాప్రియసఖి వగునీవే నా కెక్కువ.

రుక్మిణి—అయిన సరే కాని, యామోహనాంగునితోం గలిసియున్నపు డే నెట్లుందునోకద?

చంద్ర—నీవా? ఇట్లుందువు.

తే. గీ. నందుపట్టియు నీవు నా•నంద మొప్పఁ
బెండ్లిపీఁటల వసియించు•విధముఁ జూడ
నీరదస్థితసౌదామి•నీలతికను
బోలి భాసిల్లుదువుగాదె•యోలతాంగి.)

రుక్మిణి—అట్టిసుదినంబు నా కెప్పుడు తటస్థంబగును.

చంద్ర—ఎప్పుడో యననేల ? ఇంకను సమీపించకనేయుండునా !

రుక్మిణి—అది నీ కెట్లు తెలుసును ?

చంద్ర—తెలియకేమి ? సమయం బరయక తండ్రులు తరుణులవివాహకార్య భారంబు తలల నెంతకాలంబు ధరింతురే? ఆభారంబుఁ దీర్చికొనుటకు నీజనకున కిదియగదా యాదను.

రుక్మిణి—అట్లయిన నావిషయంబున కేమైనఁ బ్రయత్నించుచుండెనా ?

చంద్ర—ఆహా ప్రయత్నించకేమి. అదియొకరు జెప్పవలయునా !

రుక్మిణి—లేకున్న నింతదీర్ఘప్రయత్నం బేలనే ?

చంద్ర—ఇంతలో నంత త్వరయేలనమ్మా !

రుక్మిణి—ఆలోచించుచుండె నని నీవే చెప్పితివిగదే ?

చంద్ర—అవును. మీయప్ప యిప్పుడే చేయకతప్పే దేమి యున్నది. అమ్మాయీ !

తే. గీ. అల్లిబిల్లిగఁ దిరిగెడు•వల్లికలకు
నల్లికకు జాళి జూపువ•నాధిపుగతి
నీడువచ్చినతనయుల•కిల జనకుఁడు
విభులఁ గూర్చెడుపనులు స•ద్విధులుగావె.

రుక్మిణి—సఖీమణీ ! నీవు మంచిమాట చెప్పితివి. గాని నన్ను శ్రీకృష్ణునకే యిత్తు మని యనుకొనుచుండిరా ?

చంద్ర—నే నైతే వినలేదు. కాక మ రెవ్వరి కిత్తురు.

రుక్మిణి—సీ అదికాదే? నీవెన్నఁడైన వింటివా యనియడిగితిని?

చంద్ర—అందుకా! వినలేదైనను నీమనఃప్రియుఁ డగుపురుషుం డతండే కదా?

రుక్మిణి—ఆమహానీయుం డొప్పినఁగదా. మదీయతపంబు ఫలించుట.

చంద్ర—ఓహో! ఏమీ! నిన్నే వరియించుఁడా? యాతని కింకనెటువంటి వారు గావలయునో?

రుక్మిణి—అదిగాదే. ఇట్టిసుందరాంగుఁడు నాయట్టివారికి లభించునాయంటిని.

చంద్ర—నీవేనా అంతసులభంబుగా నున్నదానవు.

రుక్మిణి—అట్లనఁబోకుము. మగవారికేమే. ఎక్కడనైనను చెల్లుదురు.

చంద్ర—ఇప్పుడు వారే యెక్కడజూచినను ఘోటకబ్రహ్మచారులై పెండ్లిలేక సగముసగ మవుచున్నవారలు.

రుక్మిణి—ఎంతచులకన జేసితివే? నవ్వులమాటలకేమిగాని యామహానుభావున కేమికొ అంతలుగలవే.

చంద్ర—ఇప్పు డాయనసంగతికేమిలే. లోకముయొక్క స్థితిని జెప్పితిని.

రుక్మిణి—అంతటివాఁడు మనోహరుం డగుటకన్న వేఱె భాగ్యంబున్నదా?

చంద్ర—ఆహా! అందు కభ్యంతరమేమి.

రుక్మిణి—(పటంబుఁ జూచుచు)

ఉ. సోముహసించుమోముకడు♦సొంపగుతమ్ములనేలుకన్నులుఀ
చామనచాయదేహమును♦చక్కని మొల్లలఁబోల్ రదాళియుఀ
సామజహస్తసన్నిభభు♦జప్రకరంబును గల్గుకామినీ
కాముకరావలంబనము♦గల్గుట యెన్నఁడొ నాకు నెచ్చెలీ!

చంద్ర—కోమలీ! యతండె నీకు పతి యగుఁగా కనిదేవదేవు నారాధించుచుంటినిగదా?

రుక్మిణి—చెలియా !

సీ. నందకుమారుండు • నామనోవిభుఁడంచు
నెట్టులు దండ్రితో • నెన్నుదాన
దేవకీపుత్త్రుండు • భావహితుం డంచుఁ
జనయిత్రితో నెట్లు • మనవిఁ జేతు
వసుదేవసూనుండు • ప్రాణనాయకుఁ డంచు
నన్నలతో నెట్లు • లనెడుదాన
తోయజాక్షుండు చే • తోవిభుం డౌనంచుఁ
బెద్దల కెట్లు • విన్పించుదాన,
తే. గీ. తెలియు ననియూరకుందునా • తెలియదంచు
నుడువ లజ్జాభయంబు లెం • క్కుడు ఘటిల్లు
నేమి సేయుటకును దోఁప • దెట్టులైన
మానసార్థంబుఁ దెల్పక • మాన నిఁకను.

చంద్ర—వైదర్భి ! నీభావార్థం బింతవఱ కెవ్వరికినిఁ దెలియలేదనియా ? చెప్పుచుంటివి. అయినసరే ! ఇంతవఱకున్నె నీజననీజనకుల కెల్లఱకుం దెలిసియేయున్నది.

రుక్మిణి—అయిన నెందుకు ప్రయత్నంబు సేయరైరి ?

చంద్ర—అదియే మోనమ్మా సంగతి తెలియకున్నది.

రుక్మిణి—మఱి నీ కేమి దెలిసి యేమిప్రయోజనము ?

చంద్ర—తెలిసిన నింకొకరి కియ్యనిశ్చయింపఁగూడదా ? వారియిష్టమా ? నీయిష్టమా ?

రుక్మిణి—అ ట్లైనమైన ప్రస్తావన వింటివా?

చంద్ర.—ప్రస్తావన లేదు. గిస్తావనలేదు. నా కొక్కటి తెలియదమ్మా.

రుక్మిణి.—కొంత తెలిసి కొంత దెలియనట్టు చెప్పుట నన్నాటలాడించుటకా యేమి ?

చంద్ర.—నిజమైనసంగతి కాటలాడించుటేల ?

రుక్మిణి.—నిజమెద్ది.

చంద్ర.—ఏదియో మాటసామెతగా నంటిని.

రుక్మిణి.—ఇంకొకరి కియ్యఁగూడదా యనియంటివే. అదియేమి సందర్భమో !

చంద్ర.—ఏమోనమ్మా. నాకును సందియముగానే యున్నది. మనకీరవాణికి చాలామట్టుకు తెలిసినట్టున్నది.

రుక్మిణి.—కీరవాణికి తెలిసినదేమిటి. యది। నీ కెట్లు తెలిసె.

చంద్ర.—అదియేమోకాని కీరవాణి రాత్రి తనతల్లితోఁ జెప్పుచుండగాఁ గొన్నిమాటలు నాచెవుల వినంబడియు నవి మఱచిపోయితిని.

రుక్మిణి.—ఆమాటలవిషయం బెద్దియో ?

చంద్ర.—కీరవాణినిం బిలచి తెలసికొందమా ?

రుక్మిణి.—అయిన త్వరగాఁ బిలుచుకొనిరమ్మ.

చంద్ర.—ఇదిగో యిప్పుడే వచ్చెదను. (అని వేగముగాఁ బఱుగెత్తును)

రుక్మిణి—(తనలో) చంద్రకళతోఁ గూడి నేనంతిపురము ప్రవేశించునప్పుడు ముచ్చటలెల్ల మాని యిన్నాళ్లవలెఁగాక మాయమ్మమొగంబు విన్నదనంబు వహించియున్నయది దానికిఁ గారణంబు నెమకుచు సఖీసంభాషణంబున నింతలోనే మఱచితిని. ఇప్పు డదేమైయుండునో? ఇంతలో త్వరపడుటేల ! నాప్రియసఖి యగుకీరవాణి వచ్చినవెంటనే తెలియఁగలదు. (ప్రకాశముగా) సఖీ ! చంద్రకళా ! (తెరలో అమ్మా ! యిదో వచ్చుచున్నాను. అని ధ్వని వినంబడును).

(కీరవాణితో చంద్రకళ ప్రవేశించును).

కీర—(తనలో) న్యాయబుద్ధికూఁతు రగుసుశీల నాకీవార్త చెప్పినప్పటినుండి నిద్రాహారంబులులేక యీదేహంబు కృశించుచున్నయది. ఈదేవి కీవార్త నెట్లు విన్నవింతునాయని నామనం బతిడోలాయమానం బగు

చుండినను, తుదకు నాముఖంబున నే చెప్పవలసినక్టేర్పడియె. నేనేమని నుడువుదును. ఇఁక నెట్లును చెప్పక దాఁచిపెట్టినమాత్ర మేమిలాభ ముండును. చెప్పకుండిన నదెట్లు పరిణమిల్లునో ? గాన చెప్పెదను.

రుక్మిణి—చంద్రకళా! ఏదీ! కీరవాణి.

చంద్ర—ఇదిగో! వచ్చుచున్నది.

కీర—అమ్మా! వచ్చుచుంటిని (అని మెల్లగా నడుచును)

రుక్మిణి—కీరవాణీ! యింతతడవేలచేసితివి?

కీర—తడవేమియు లేదు. వచ్చిమాత్ర మేమిప్రయోజనము (అని మోము వంచి కన్నీరుగార్చును)

రుక్మిణి—(తత్తరపాటుతో) నెచ్చెలీ! ఈదుఃఖమేమి? నాతోఁ దడయకఁ జెప్పుము.

కీర—అమ్మాయీ! ఏమని చెప్పుదును (అని కూలఁబడును)

రుక్మిణి—(దైన్యముతో కీరవాణి హస్తంబు పట్టుకొని)

తే. గీ. చెలియరో నీదుమదిలోనఁ • జింత పొడము
కారణంబేది యిప్పుడు•గలిగెనమ్మ

కీరవాణి.—నిన్ను శిశుపాలునకు నీయ•నిశ్చయించి
కమ్మ బంపెను నీయన్న•కలికి నిన్న.

రుక్మిణి—హా! హతవిధీ (అనిమూర్ఛిల్లును)

చంద్ర—అకటా! ఎంతపాప మెంతపాపము! వచ్చిరాకముందే యెంతపిట్ట పిడుగువార్తఁ జెప్పితివే కీరవాణీ!

కీర—ఎంత నిబ్బరించినను భరింపఁజాలక నుడివితినే చంద్రకళా!

చంద్ర-తే. గీ. కీరవాణి యనుచు•గారవంబునఁ బిల్చు
చేడె కిట్టిమాటఁ•జెప్పనగునె

సార్థకాఖ్యదోలఁగెఁ జయ్యన నీనోటఁ
బిడుగుఁబోలుమాటఁ వెడలుకతన.

కీర—మిగిలినదానికి వగచిన నేమిప్రయోజనము. నాప్రాణసఖి మనోభీష్టంబు నెరవేరమికిఁ జింత నొందవలయునుఁగాని కొంత నాప్రశంస యెందుకు ?

ఉ. చేదిపురీశునామమునుఁ జెప్పినయంత నెఁదా సహింపకి
మ్మేదిని వ్రాలె నీవెలదిఁ మిన్న యిఁ కేమనిపల్కి మోదము
త్పాదనసేయుదాన పెరఁ దానను నే నిటులన్ దిగుల్పడన్
ఖేదము నొందదే? వలచుఁ కృష్ణునివియ్యముదప్పె నంటచేన్.

అదియునుంగాక వసుదేవుకుజ్ఞునిదివ్యరూపసుందరలావణ్యంబును, తదీయ గాంభీర్యచాతుర్యాదిగుణంబులును పెద్దలెల్లపుడు జెప్పికొనుచుండుటచే వినుటంబట్టి యీమె విశేషమోహంబుచే మనంబున వరించియున్నది గావున నిట్టిచింతకు మూలంబయ్యె.]

రుక్మిణి—(కూర్చుండి) కీరవాణీ! నాజనకుండు మాయన్నగారిమాటకు సమ్మతించి కబురంపెఁగా ?

కీర—అమ్మా ! యెందుకు సమ్మతించును ! చాలామటుకు చిన్నన్నగారగు రుక్మరథుండును, నీజనకుండును, నారదమునీంద్రుండును యెన్నిహితంబులు సెప్పినను, నవి పెడచెవిం బెట్టి చెడ్డమతంబున శిశుపాలునకే యిచ్చెదనని వారియనుమతిని నిరాకరించె.

రుక్మిణి—

[ఉ. ఆమహనీయరూపము నఁ హర్నిశమున్ మదిలోన నిల్పిన
న్నోమెఁ దనోము లన్నిట ఫఁలోదయమై విలసిల్లె నంచు నెం
తో ముద మొప్ప నుంటి నిఁకఁ తోయజనేత్రునిఁ బొందుబాపితే
హా! మతిలేనిమూర్ఖ చతుఁ రానన వైరముబూనితే కటా !]

(చిత్రపటంబు వీక్షించుచు)

సీ. నిండుపున్నమనాఁటి•పండువెన్నెలకాంతిఁ
బొలుపారుచిఱునవ్వు•లొలుకువాఁడు
హారకిరీటకే•యూరకుండలకౌస్తు
భాదిభూషణముల•నలరువాఁడు
హలకులిశధ్వజా•ద్యమలరేఖలతోడ
భాసిల్లువరపదా•బ్జములవాఁడు
కోమలతరనీల•కుంతలజాలోర్ధ్వ
సంస్థితబర్హిపిం•ఛములవాఁడు,

తే. గీ. డంబుమీఱినకనకాంబ•రంబువాఁడు
శంబరారిని మించురూ•పంబువాఁడు
నామనోధవుఁ డౌనంచు•నమ్మియుండ
నాసలన్నియుఁ బాపితే• హా! విధాత.

చంద్ర.— అమ్మా! యావిధాతకృత్యంబు లెప్పటికిని విసమంబులేకదా?

సీ. నిరుపేదకొసగు న•నేకసంతానంబు
భాగ్యభోగికిఁ బ్రజా•ప్రతతి వీఁడు
పుణ్యవంతునకు•సంపూర్ణాయు వీయఁడు
పాపికి చిర మగు•బ్రతుకొసంగు
వితరణశాలికి•విత్తంబుఁ గూర్పఁడు
కడులోభికి ధనంబుఁ•గలుగఁజేయు
చక్కనియువతుల•సరసులఁ జేర్పఁడు
సుందరికి విరూపి•పొందొనర్చు,

తే. గీ. నహహ పద్మజుకృత్యమే•మనఁగవచ్చు
నొక్కటైనను సమకూర్చఁ • డొప్పుమీఱ

నీవ్యుఁ ద్వాపరమేష్ఠికి నెట్లువచ్చె
ద్రుహిణనామ మదియు దుష్కృతులనుగాక.]

కీర.—చంద్రకళా! మనరుక్మిణికి శిశుపాలుండు వరుం డగునని మనము కలలోనైన నెంచియుంటిమా? ఇన్నిఁటికి మనజన్మము దుఃఖభాజనము సుమా!

రుక్మిణి.—

శా. నారీరత్నము లెల్లరుఁ జెలఁగి నీనాథుండు శ్రీకృష్ణుఁడౌ
నౌరా! యెంతటిభాగ్య మబ్బెనని నన్నగ్గించుచుఁ బాడఁగా
గారాబంబున దేవకీసుతుఁడు నాకాంతుం డటంచేముదం
బారంగోరుచునుండ నన్నియు నయో వ్యర్థంబులయ్యెంగదా.

అయ్యో! ఇంకెక్కడిభాగ్యంబు. నామనోరథంబు నేఁటితో వమ్మయ్యెఁ గదా! నాపెద్దన్నగా రగురుక్మిమతంబున కడ్డుపడువా రెవ్వరు? నారదమునీంద్రునంతటివాఁడు చెప్పినను విననివాని కింకెవరు జెప్పఁగలరు. చేదిపురంబునకు శుభలేఖనంబంపెనే యది యెట్లు తప్పును. నవమోహనుఁ డగుకృష్ణుండు దూరంబాయెఁగా? అయ్యో! యతనిఁ గూడక నే నెట్లు బ్రతుకఁగలను. చక్రధరకరస్పర్శనప్రాప్తి లేనియీకరంబు లేల శుభకరంబులగు.

సీ. కంజనేత్రునిమేన గంధంబలందని
కరయుగములు దుఃఖకరములుగద
కంసారిచరణయుగ్మంబు లర్చింపని
కరములు దుష్టప్రకరములుగద
కమలనాభునిశరణ్యమునకుజొరనట్టి
కరములు కష్టసాకరములుగద
కమలేశు నిజకరగ్రహణం బొనర్పని
కరములు సంకటకరములుగద,

తే. గీ. యీాకరంబులు భక్తులో • కేశసుప్ర
శస్తహస్తావలంబనా • సక్తిచేత
శ్రీకరాప్తివహించును • గాక యేల
కరము లున్న ఫలంబు యీా • కరణి నాకు.

కీరవాణి.—(రుక్మిణిచేయిఁ బట్టుకొని)

[ఉ. బొమ్మలఁ బీఁటలం దునిచి • బోటిరో నిన్నును గోపబాలునిన్
బొమ్మలరూపుగాఁ దలఁచి • పొందికమీఱఁగ బెండ్లి సేయుచున్
కమ్మనిపాటల న్మధుర • గానమొనర్చినమేము రేపు నో
యమ్మరొ పాడుచై ద్యుకర • మంటఁగనిన్నెటుజూతుమక్కటా!]

(అనికన్నీరొంచి) అమ్మాయీ! నే నింటికిం జని మనసుశీలతో మాట్లాడి మఱలఁ జనుదెంచెద! నీవు దుఃఖింపకుము. (అనిపోవును)

రుక్మిణి.—దుఃఖించిన నేమిఫలము?

ఉ. పూర్వభవంబునందు కడు • పూజ్యసతీవర వాంఛితంబు నే
గర్వముమీాఱికూర్పకను • గాదని భంగముఁ జేసినానె యీా
దుర్విషయంబు లిప్పటికిఁ • దోడ్పడి నన్ను గలంచె నయ్యయో
సర్వసుఖంబులుం దొలఁగె • సంగతి దప్పెనిఁ కేమి జేయుదున్.

చంద్ర—రాజముఖీ! యిం కెంతనిసంతాపంబు నొందగలవు? నీవనిన్నట్లు లా
పూర్వజన్మదుష్కృతంబే నీకోరిక కొనసాగింపదయ్యె.

రుక్మిణి—నెచ్చెలీ! కామినీమదనమూర్తినిఁ గూడలేనియీా దేహసౌష్ఠవంబు
నాకేల?

సీ. పంచశరాకృతి • మించుసుందరమూర్తిఁ
గాంచక యెట్లు జీ • వించుదాన

కాంచనాంబరుని వ•రించికౌఁగిట
నలరించక యెట్లు జీవించుదాన
పంచేషుగురున కీ•పాంచభౌతికము
నర్పించక యెట్లుజీ•వించుదాన
నంచితసుగుణు సే•వించి మృదూక్తుల
మించక యెట్లుజీవించుదాన,

తే. గీ. మంచిమల్లెలు సరులఁ గూ•ర్పించి మెడను
నించి మోదించ కెట్లు జీ•వించుదాన
మించుదిలకించినట్లు లే•తెంచి గార
వించకుండిన నెట్లు జీ•వించుదాన.

అక్కటా ! యీజన్మంబున నిట్టివిభవంబు నా కెట్లు సంభవించును. ఇట్టి మోహనాంగుని జతగూడి సరససంభాషణంబులఁ గ్రీడించక యుండు టెట్లు? ఎట్టివిషాదంబునకు లోనైతిని. నాకిఁక నేటియాస ?

ఉ. అందనిమావిపండు నకు•నాసవహించినరీతి మబ్బులోఁ
జెందురుఁ గోరుబాలకుని•చందము కోరిక రిత్త యయ్యెగా
నందకుమారరత్నమిఁక•నా కెటులబ్బును యేమి దోఁచ దే
నెందును జొత్తు నేమిట మ•దిచ్ఛ ఫలింపఁగగల్గు దైవమా.

మిగిలినదానికి వగచినలాభ మేమిగల్గును ? నావగపు దీర్చువారెవ్వరు.

ఉ. కోరిన దెల్ల తత్క్షణమ•కూర్చెడుతల్లియుఁ దండ్రియున్ బలో
దారయశోధనార్జితులు•తక్కినయన్నలు నల్వురుండియున్
క్రూరుఁడు రుక్మితోడఁ బ్రతి•కూలవచస్సుల నాడి విప్రునిం
ద్వారక కంపి శౌరి యిటు•వచ్చునుపాయము సేయరైరిగా.

చంద్ర—అమ్మా ! వా రొకవేళ కబు రంపఁగా యాదవేంద్రుండు నిజగణం

బాలతో వచ్చును. అప్పు డుభయపక్షంబులకును ఘోరయుద్ధంబై
యే దెట్లు జరుగునో యనుసందేహంబున నూరకుండి రనితోఁచుచు
న్నది.]

రుక్మిణి—చంద్రకళా! ఇందుకు సమపాయం బేమైన నీవైనను చెప్పవు
గదా?

చంద్ర—అమ్మా! నే నేమని చెప్పుదును? నాకుం దోఁచకున్నయది. మంచి
యుక్తిశాలి మనకీరవాణియే! ఆమె వచ్చినపిదప నేదోయొకయాలో
చన నిర్ధారణ గావింతము.

రుక్మిణి—సఖీ! నే నెట్లు బ్రతుకఁగలను?

[సీ. అంబుజేక్షుణునిఁ బ్రేమం బున నుపగూహ
నంబు సేయనిశరీ రంబ దేల?
కంబుకంఠుపదాంబు జంబులమ్మృదు
సేవనంబు లేనట్టిహ స్తంబు లేల?
అంబుదవర్ణు ది వ్యాంబరాదివిభూష
ణంబులఁ గననినే త్రంబు లేల?
నంబుధిధీరు ని త్యంబు కల్యాణ గు
ణంబు లెన్ననిరస నం బ దేల?
తే. గీ. తుంబురాదులు బాడుగీ తంబుసుఖత
రంబు గా దనిపించి లో కంబు మోహ
నంబు జెందించువేణుగా నంబు సంత
సంబు మీఱంగ విననిక ర్ణంబు లేల?]

చెచ్చెలీ! ఆమహనీయుని వరింపక యీదేహంబునం దసువు లింకెట్లు
నిల్పఁగలను. నిల్పి యీవియోగం బెట్లు సహింపఁగలను. అయ్యో! యీజ
న్మంబు నా కింకేటికి. హా, మదనసౌందర్యమూర్తీ! హామనోహరా!
నందకుమారా!

మ. అనిశంబుం వసుదేవుముద్దుసుతు గా•ఢాశ్లేషణాసక్తిసం
జనితంబై నమనంబుతో చెలియగా•జన్మించఁగా నేల పో
వనజాతాయతనేత్రుకంఠమున శో•భన్మించుహారంబనై
నను నాకౌస్తుభరత్నరూపముగ నై•నం బుట్టనైతింగదా.

చంద్ర.—అమ్మా! నీవనినట్లాదివ్యభూషణంబులు నిత్యత్వంబు వహించి తులలేని మహావిభవంబుం గాంచుచుండె నంతకన్న వేఱే భాగ్యం బున్నదా!

రుక్మిణి.—

ఉ. పుట్టిననాఁటనుండి యదు•పుంగవుఁడే తగుభర్తయంచు పే
ర్వెట్టుచు చేడెలెల్ల భళి•రేయని సంతసమందుచుండ నా
చుట్టఱికంబు నడ్డువడ•సోదరభూతము మాయఁ జేసె నా
యట్టియభాగ్యలీపుడమి•యందునఁగల్గిరె యెన్నఁడేనియున్.

చంద్ర.—దేవీ! వివేకశిరోమణి వగునీవే యిట్టియవివేకప్రలాపంబులఁ బరితపించుచున్న పు డింక యితరులఁ జెప్పనేల? కాఁగలదానిని యోచింపవలయుఁగాని యిఁక చింతాప్రశంస నుడుగుము.

రుక్మిణి.—ఇఁక మనవలనఁ గాఁదగుప్రయత్నం బేమియున్నది?

చంద్ర.—కాదని యూరకుండు టెట్లు?

రుక్మిణి.—అయిన నేమి చేయుదుము?

చంద్ర.—ఎట్లయిన పురుషోత్తముం డిటకువచ్చునుపాయంబు సాధించవలెనని నాకుం దోఁచినయభిప్రాయము.

రుక్మిణి.—అది మన కెట్లుసాధ్యం బగును?

(కీరవాణిప్రవేశించును.)

చంద్ర.—అమ్మా! అదిగోవచ్చె. భవన్మనోరథసాఫల్యకారిణి యగుకీరవాణి.

రుక్మిణి.—ఆహా! నాచెలియంతటిదియే యగును. దైవికార్థంబునకు మీ రేమి చేయఁగలరు.

కీర.—దేవీ! నే సెలవొంది వెళ్లినది మొదలు మంత్రికుమారిక యగుసుశీలతో నాలోచించఁగా! రహస్యంబుగ మనమిప్పట్టున ద్వారకకు సమాచారంబు బంపుదమనియు, వెంట నే కృష్ణుండు రాఁగలం డనియు, నాలస్యంబులేక కబు రంపుఁడనియు నాకుం జెప్పినది. తద్విషయంబు నీకు విన్నవింపఁ ద్వరగా నే తెంచితి.

రుక్మిణి.—స్త్రీజనసామాన్యోక్తుల నతండు విశ్వసించునా?

కీర.—ఆకోడెగానికి స్త్రీజనప్రశంసకన్న నాదరణీయం బగుకార్య మొండు గలదా?

రుక్మిణి.—(సిగ్గునఁ దలవంచుకొనును)

కీర.—అమ్మాయీ! లోక మెల్ల నెఱింగియుండుసంగతికి సిగ్గునఁ దలవంచుకొను టేల?

రుక్మిణి.—(మెల్లగా) నమ్మి రాఁగలఁడా?

కీర—సందేశంబు నడుపుధీరుండు చమత్కృతిగలవాఁడైన వచ్చుట కభ్యంతర మేమి?

రుక్మిణి—అట్టి మహోపకారపరాయణు లెవరు మనకుఁ దోడ్పడుదురు?

కీర—అయ్యో! అ ట్లనెద వేల! యుండ లేదా!

రుక్మిణి.—ఎవరు.

కీర.—మనపురోహితుం డగునగ్నిద్యోతనుండు.

రుక్మిణి.—(సంతసముతో)ఆమహాత్ముని రహస్యముగా నిక్కడకుఁ దోడ్కొని వచ్చెదవా?

కీర.—ఇదిగో. ఇప్పుడే! నా వెంటఁ గొనివచ్చెదను. (అనిపోవును).

రుక్మిణి.—చెలీ! చంద్రకళా! ఆమహాత్ముం డొప్పుకొనునా?

చంద్ర.—సఖీ! ఆయన మన మెఱుంగనివాఁడా? గూఢముగా నే కార్యముఁ జక్కఁబెట్టును.

రుక్మిణి.—(విచారముతో)

ఉ. ఎప్పుడు నామనఃకువల•యేందునిఁ గన్నులఁ జూడఁగల్గు నిం
పొప్పఁగఁ బూజ చేసి పర•మోత్సవలీల మెలంగఁగల్గు నే
నెప్పుడు కృష్ణుచెంగటను•నింపుగ నుండి సుఖింపగల్గు నిం
కెప్పుడు నామనోగతని•జేచ్ఛ ఫలింపఁగఁగల్గు దైవమా?

(కీరవాణియు, అగ్నిద్యోతనుఁడును ప్రవేశింతురు)

అగ్ని.—(తనలో) రాకుమారిక యగు వైదర్భియు, నెచ్చెలులును ఏదోయొక యవసరమైనయాలోచనం బొనర్చి నన్నంతఃపురస్థలికి రమ్మని కబురంపిరి. జవ్వనియు, సుకుమారియు, నవలావణ్యశోభిత యగు నాయమ నన్నురమ్మని పంచినకారణం బేమైయుండును? ఎద్దియో యన నేల? మొదటనుండియు, వసుదేవసుతుండే యీముద్దియకుఁ దగినవల్లభుండని యెల్లరును సంతసించుచుండ దమఘోషనందనుం డగుశిశుపాలున కీకన్నె నీయసమకట్టి గర్వపూరితుం డగురుక్మి యెల్లుండి లగ్నంబు నిశ్చయించి గదా దురాత్ముం డగునాతనయుండు మిత్రవిందునిచేఁ జేదిపురంబునకు శుభలేఖనం బంపె. నావర్తమానంబు దెలిసి యీతన్వి మనోదుఃఖంబున తల్లడిల్లుచు నేమియుం దోఁచకుండి నాయెడ నామెకు నున్నచనువుచే నాకు కబురంపియుండును. ఈసమయంబున నింతకన్న వేఱుకారణం బేమియుఁ గాన్పించదు. ఇట్టిసమయంబున యీసుగుణనిలయ నూరార్చుటయు నాకుఁ గర్తవ్యంబుగాన నీమె వెంటం జని యామె నాశ్వాసించెద. (అనిరుక్మిణిని సమీపించును)

కీర.—అమ్మా! రుక్మిణీ! భూదేవునిం దోడ్కొనివచ్చితి.

చంద్ర.—నెచ్చెలీ! యార్యులిదే విచ్చేసిరి.

రుక్మిణి-చంద్ర.—(సమీపించి) బాడబాగ్రగణ్యా! వందనములు (అనినమస్కరించుదురు)

అగ్ని.—కల్యాణమస్తు (అనియాశీర్వదించును)

చంద్ర.—భూసురేంద్రా? ఈభాసురాంగి పెండ్లివర్తనమంతయు వింటిరి గదా?

అగ్ని.—ఇంకను వినక నేయుండవలెనా కాలముక్యతి రేకముగాఁ బరిక్రమించె కానీ (యనితలయూఁచుచు, రుక్మిణితో) అమ్మాయీ! నీ విట్లు దీనవదనవై దుఃఖింప నేమిలాభము. నాయెడ రవంతయు దాఁపక నీయభిప్రాయము తేటపఱుచుము. ఆశ్రితుండ నగునాకడ సందేహ మేల?

[రుక్మిణి—ఆ. వె. భూమిదేవ వినుము♦నామానసార్తినిఁ
బాపి వేగ కార్య♦భరముఁ బూని
వాంఛితార్థసిద్ధి♦వఱలంగఁ గావింప
సాయ మిపుడ నీవు♦ జేయవలయు.

అగ్ని—నావలనఁ గాఁదగుకార్యం బేమి యున్నది.

శా. బాలా! నన్నిటు దీనవాక్యములచేఁ♦ బ్రార్థింపగా నేల యె
క్కాలంబున్ హితకార్యమారయుచు మీ♦ కారుణ్యసత్ప్రా
ప్తికిం, బాలై నాదుశరీర ముండుటగదా♦ ప్రావీణ్యముం జెం
దెడున్, మేలౌ; మాకు పురోహితత్వవిధులే♦నిక్కం బను
ష్ఠేయముల్.

గావున నది నీ వెతింగించినచో సాధ్యాసాధ్యంబుల యోజించెద.

రుక్మిణి—అది గొట్టిదైనను మీకుం దక్క నితరసాధ్యం బగునది గాదు కావున నామనవి నంగీకరింపుఁడు.

అగ్ని—అయినఁ జెప్పుఁడు.]

రుక్మిణి—ఉ. పంచపాది.—

ద్వారవతీపురంబునకుఁ♦దక్షిణ మేఁగి భవద్వచశ్చమ
త్కారవిశేషము ల్నెరపి♦తామరసాక్షునికోర్కి నాపయిం
జేరఁగఁ జేసి శత్రువుల♦ చేవ యడంచు మటంచుఁ జెప్పి శ్రీం

గారముతోడ భీష్మకుని♦గాదిలిపట్టినిఁ బెండ్లియాడు మా
వీరకులాగ్రగణ్యుయని♦ పేర్కొనితోడ్కొనివచ్చి ప్రోవుమా.

(అని సమీపించి నమస్కరించును).

అగ్ని—(తనలో) ఆహాహా! ఏమి యీ మెభక్తిగౌరవము. (ప్రకాశముగా) అమ్మా తెలియవచ్చె లెమ్ము. (కీరవాణివంకంజూచి) కీరవాణీ! నీ వేమో చెప్పవచ్చుచుంటివి. నీయభిప్రాయంబు త్వరగాఁ జెప్పుము.

కీరవాణి—తే. గీ. బాడబాగ్రణి నీవు గో♦పాలబాలు
సన్నిధికి నేఁగుటయును నీ♦సరణిఁ దెల్పి
తోడితెచ్చుప్రయత్నంపు♦జాడ పరులు
జూడకుండంగ బొమ్ము నా♦తోడుసుమ్మ.

(అని నమస్కరించును.)

అగ్ని—(తనలో) యీ మెకు రుక్మిణియం దుండు ప్రేమానుబంధ మెంత వినుతింపఁదగినది, (ప్రకాశముగా) చెలువా! బాగు, బాగు, లెమ్మ.

చంద్ర—భూదేవేంద్రా! నామనవియు నొకటి నవధరింపవలయు.

అగ్ని—అభ్యంతర మేమి? త్వరగాఁ జెప్పుము.

చంద్ర—ము. శిశుపాలుండు దురాత్ముఁ డాఖలుని దు♦శ్చేష్టల్
మదినెంచి త, ద్వశు లైయుండిరి మాగధాదికుమతుల్ ♦వా
రంద రాచైద్యుఁతో, డ శరాద్యాయుధపాణులై యిటకుఁ
జూ♦డన్వత్తు రీసంగతిన్, విశదం బొప్పఁగ జెప్పి నందతన
యున్ ♦ వేగంబు గాఁ గూర్పుమా.

(అని నమస్కరించును.)

అగ్ని—(తనలో) యీచిన్నదాని యూహాపోహణలుజూడ మిక్కిలి మనోహరములు. రుక్మిణికిం దగినస్నేహితురాండ్రు. వీరిమృదుమధుర

వచోరచనలత్యద్భుతంబులు. (ప్రకాశము గా) రమణీమణీ! చాలు జాలు. నీవు నీపేరునకే తగుదువు.

చంద్ర—భూసురాగ్రణీ! యాలస్యంబుసేయక పోవలయును.

అగ్ని—(తనలో) అహాహా? ఇదేగదా నాజన్మంబునకు శుభోదయం బగు సుదినంబు. వైదర్భదేశాధీశునకనుంగుపుత్త్రియై యొప్పెనికోరికల నిరంకుశంబుగాఁ బడయందగు. నీబాల మనంబున జననీజనకసహోదరకృత్యంబులందువిరక్తిం జెంది, నన్నొక పెద్దగాఁ జేసి తనయభిప్రాయంబు నాకెఱింగించి యత్యంతసుందరాకారుం డగుగోవిందునికి తనసందేశంబునివేదింప నన్నుఁబేర్కొని ప్రేరేపించె. ఈప్రయత్నమున కేనియ్యకొనుటచే, నాజీవనంబునకేమైన భంగంబుగల్గినను గలుగుఁగాక. నాయొనర్పంబోవుకార్యంబు నిరర్థకంబుగాక. సార్థకంబై ఫలించినచో రుక్మిణీకృష్ణకృపాకటాక్షలబ్ధవిభవుండ నగునా కేది సమానం బగుదురు. గావున ముకుందసందర్శనార్థంబు ద్వారకాపురంబునకుం జనెదను గాక. (రుక్మిణివంకఁ జూచి, ప్రకాశముగా) ఓసుగుణవతీలలామా! నీయభిప్రాయమునకే నియ్యకొంటి నిప్పుడే పోయెదను. నీమనంబునం దుండుపగఁ దొలంగుము.

చ. సరసిజనేత్రి నీపలుకు • చందము లెస్స గ్రహించినాఁడ స
త్వరగతిఁ బోయి ద్వారకకు • బద్మదళాక్షునిఁ గాంచి నీమన
స్థిర మగుభంగిఁ బల్కి యదు • సింహునిఁ దోడ్కొనివచ్చె
దఁ దలఁకో, దఱి సెలవిమ్ము నీయభిమ • తంబు నొనర్పఁగ బో
యి

రుక్మిణి—భూసురేంద్రా! నాకడసారివిజ్ఞాపనం బవధరించి నా సందేశం బిట్టిదని యాదవేంద్రునకు నివేదించుము.

సీ. సుందరశోణార • విందసన్నిభమైన
చరణయుగ్మము నాకు • శరణ మనుము

బృందావనాంతభూ♦విహరణశ్రమ నొందు
నడుగులకుఁ బ్రణామ♦మిడితి ననుము
కాళీయుశిరములు♦గంద నృత్యము సల్పు
పదముల కిడె నమః♦పదములనుము
చామరధ్వజహాల♦చక్రరేఖల నొప్పు
నంఘ్రులకు సదా జో♦హారు లనుము,

తే. గీ. పావనంబులు నిఖిలశు♦భావహములు
మోదములు సేవకాళికి♦ముక్తిదములు
వేదసారము లాశ్రిత♦శ్రీదములును
నైన నీపాదములు మదిఁ♦బూనె ననుము.

సీ. నిన్ను కామించిన♦కన్నె యీయన్నులమిన్న
కైకొను సుప్రస♦న్న యనుము
నిన్ను గా కన్యునిఁ♦గన్నులఁ గన నెల్ల
నన్నెలు మా ప్రాణ నాథ యనుము
పన్నగశాయి యూ♦పన్నురాలిది దీని
విన్నపము విను గో♦వింద యనుము
చిన్నది నీపైనిఁ♦గన్ను లుంచెను గావు
గ్రన్నన సుగుణసం♦పన్న యనుము,

తే. గీ. అన్నపంతంబు సున్నయై♦చన్నదాఁక
నిన్నుఁ గని త్వత్కరంబూఁత♦గొన్నదనుక
నన్న మొల్లదు నిద్దుర♦యనదు మిగుల
ఖిన్నయై యున్న దిప్పుడు♦కృష్ణ యనుము.

అగ్రజన్మకులాగ్రణీ! సర్వజ్ఞు లగుమీకు నేఁ జెప్పవలసినవిషయంబు లెవ్వియు లేవు గావున త్వరితగమనంబున ద్వారకానగరంబునకుం జని బల

రామానుజుం డోడ్కొనిచన్చుభారంబు వీాయది. యని నేను త్రికరణశుద్ధిగా నమ్మియుండెన. నాసందేశంబు హరికి విన్నవించునపు డీరహస్యలేఖను మర వక శౌరికి సమర్పించుము (అని జాబు చేతికిచ్చెను.)

అగ్ని—తరళాక్షీ ! యెట్టివారికైనను రసోచితంబు లగునీవాక్యంబులు వినిన నాక్షణంబె మనసు కరుగకుండునా ? దయారససరసహృదయుం డగుహరి నీవిజ్ఞాపనంబు వినినక్షణంబె కదలి నీవదనసందర్శనము సేయ కుండునా ? అమ్మా ? నేను బోయివచ్చెదను (అనిపోవును).

చంద్ర—ఇందుముఖీ ! యిప్పుడు నీడెందంబున కొందలపాటు కొంతవఱకు డిందుపడియె నని నే ననుకొనియెద.

రుక్మిణీ—కాంతా ! అంత యదృష్టంబు కలిగినప్పటికి గదా ! యింతలో నే మైనది.

చంద్ర—చెలియాలా కీరవాణీ ! మన మింక నిక్కడ నున్నచో రాకుమారి యేమియుం దోచక యేమేమో తలపోయు చుండును.

కీర—అయిన మన మింక శృంగారోద్యానంబున కీరమణిని వెంటఁ బెట్టుకొని పోయి మనోహరలతాభవనంబులం దించుక సేపు గ్రీడించి యీ మెమ నంబున కానందము కల్పింతమురమ్మ.

రుక్మిణి—చెలులారా ! పోదమురండు. (అని యందఱు పోవుదురు).

తృతీయాంకము ముగిసెను.



శ్రీ ర స్తు.

శ్రీ గోపాలకృష్ణపరబ్రహ్మణే నమః.

---

# రుక్మిణీ పరిణయము.

## చతుర్థాంకము.

### (ప్రథమరంగము.)

ద్వారకాపురి శ్రీకృష్ణసభాభవనము.

(శ్రీకృష్ణుండును, చతురమతియు సింహాసనాసీనులై యుందురు.)

విజయుఁడు ద్వారముకడనుండును.

చతు—యాదవేంద్రా! మహానుభావుఁ డగుదేవమునీంద్రుండు సెప్పినట్లు కుమతు లగుశిశుపాల, జరాసంధాదులప్రేరేపణంబున దుర్మతంబు వహించి రాకుమారుం డగురుక్మి చేసినశపథంబున కడ్డుపడం జాలక భీష్మకుం డూరకొండెఁ గాని యిం దాతనితప్పేమియున్నది?

కృష్ణ—మిత్రమా! అవ్వనవును. (తనలో)

శా. ఔరా! భీష్మకరాట్కుమారిపయి మోహభ్రాంతిచే సా
రగం, భీరాకాంత నుండుచిత్తమిపు డావిద్యుల్లత న్బోలి తా,
స్మారై చంచలవృత్తిఁ జెందె నకటా! రాకేందుబింబాస్య
నే, పారం జేరి వరింపకున్న నిఁక నన్ వ్యర్థుం డటం చెన్న రే.

ఏమిది! నాహృదయం బంతకంతకు ధైర్యంబు వీడుచుఁ దత్తరపాటు వహించుచున్న యది. ఇది యిం దెవ్వరిదోషంబునుం గాదు. మోహావేశసమన్వితం

బగుమదీయచిత్తజనితప్రామాదికదోషంబె. ఓహృదయమా! యిది సమయంబు గాదు గావున నింతిపై నుండుమోహంబున కావంతయైన సందు నీవము.
(అనిరుక్మిణిపటంబు కేలధరించి)

శా. ఈవేణీరుచి జూడ రాహుసమ మం॥చీమోము చంద్రుం
డే యం, చీవక్షోజము లాగిరిద్వయమె యా॥ నీకన్ను లా
యిందుబిం, బావాసాంకమృగీవిలోచనము లా॥ రా! బాహు
లాతమ్మితూం, డ్లై వెల్గొందు నటంచు నాదుమదిలో॥ నాశ్చ
ర్యమ్ముల్ దోఁచెడిన్.

ఈచిత్రఫలకంబునం దీరూపంబు వీక్షించినదాన నాహృదయం బంగజశరావిద్ధంబై తాల్మి వహింపకున్నయది. ముందు కార్యగతి నాలోచించుటకేమియుం దోఁచకున్నయది. తోఁచకున్ననెట్లు? నిత్యానందస్వభావంబు గల నామనంబు నారదవాక్యశ్రవణమాత్రంజేసి వికలంబై తోఁచె. ఎన్నఁడు తలం పరానిపాటుద్భవిల్లె (ప్రకాశముగా) వయస్యా! చతురమతీ! నీవనినట్టు లెవ్వరిదుష్ప్రారంభంబైనను నావలచినట్టిసుందరాంగి శిశుపాలునిరాణి యగునని చెవులార విని నే సహించు టెట్లు?

శా. బాల్యం బాదిగ నాకు భార్యయని మా॥వారంద ఱుత్సా
హాప్త్యాఫల్యాత్మన్ దగియుండఁజై ద్యభరణీ॥ భామాధిపుం డా
త్మకో, టిల్యా బొప్పఁగఁ జుల్కఁజేసి నను౦బో॥టిం గోరెని
న్నాళ్లనుల్ దుల్యుఁడే యని సాత్వతిం దలఁచి బం॥ధుత్వం
బుపాటించితిన్.

మఱియు.

ఉ. వావి దలంప కిట్టిపశు॥వర్తనముం దగఁ బూని మద్విరో
ధావలిఁ గూడి రుక్మిని వ॥శాత్మునిఁగా నొనరించి వాని దు

ర్భావుని జేసియుల్లసత్పుంబ॥ ల్కులమత్కులముకానను౦దృణీ
భావ మొనర్చి వాఁడు పరి॥ భావప్రయత్నతనుండె మిత్రమా!

చతు—ఆశిశుపాలుండును, జరాసంధుండును, దంతవక్త్రుండును, సాల్వుం డును, పౌండ్రకుండును, దుష్టపంచకంబనియును, భూపాలకులయ్యును, నధర్మవిస్తారులనియును, ప్రపంచంబెల్ల ప్రసిద్ధంబైయున్నది. వారి దుర్బోధనలు విని యీరుక్మి యేల కాదనవలయు నెన్నండైన యీ తని కిట్టి దుర్మార్గంబు పట్టుపడునని స్వప్నమందైనను దలంచితిమే ?

కృష్ణు—మిత్రమా! అట్లనెదవేల? సాంగత్యదోషం బూరకపోవునా! వినుము.

తే. గీ. అంబుదంబు వర్షించుశు॥ ద్ధాంబుధార
చవిటినేలను ప్రవహింప ॥ సరసతఁ జెడు
భంగి గుణవంతుఁ డొకవేళ॥ బాపచిత్తు
సఖ్యతను గన్న సుగుణంబు॥జనకయున్నె.

చతు—గోపాలచూడామణీ? మంచిమాట బల్కితివి. అయినను, ఈవిష యంబున భీష్మకకుమారుం డగురుక్మియు దుష్టపంచకంబు తోపాటు మనయందు బద్ధద్వేషుండనియే, కనుపడుచున్నది. ఒకవేళ శిశుపాలా దులు దురూహ కల్పించినను పెద్ద లగునారదమునీంద్రులను సభాస్థలి యందు లక్ష్యపెట్టక వారిమాటల నిరాదరణంబుజేసి బరిభవోక్తు లా డెంగదా!

కృష్ణు—అవును, దురాగ్రహంబు గలవారికి తారతమ్యబుద్ధి పొసంగునా!

చతు— పొసంగకపోవుటం బట్టియే. మునీంద్రుఁడు తగినప్రాయశ్చిత్తం బొనర్చె.

కృష్ణు—అదియేదీ! యేమిచేసెనో?

చతు—ఓహో! నీ వెఱుంగవా? వినలేదా?

ఆ- వె. వాఁడిములుకులట్లు వాఁడు దుర్మదమున
మనసు నొవ్వఁ బలుక మునియుఁ గినిసి
బలియుఁ డైనయట్టి బలరాముఁడే నీదు
పించ మడఁచు ననిశపించెఁ గాదె.

కృష్ణ— అవునవును మఱచితిని. ఎట్టివారైనను పెద్దలమనము నొప్పించిన నాశనం బె తత్ఫలం బనుభవింతురుగదా!

చతు— దేవరవారిబుద్ధి యేమో పరాకు జెందుచున్నట్టున్నది? మనం బెక్కడనో సంచరించుచున్నట్టు ముఖవికాసంబు సూచించుచున్నది!

కృష్ణ— ఆ! వయస్యా! మరేమియులేదు. ఏమిది? ఈదినము సభాభవనంబునకు మాయన్నగారిరాక కాలస్యకారణం బేమో! తమ్ముఁడు సాత్యకియు రాఁడాయెఁగదా!

చతు— నేను వెళ్లి పిలుచుకొనివచ్చైన వత్తునా?

విజయుఁడు— యాదవేంద్రా! తమ్ముఁడుగారు వచ్చుచున్నారు.

సాత్యకి— (ప్రవేశించి) అన్నా నమస్కారము (అని నమస్కరించును)

కృష్ణ— కల్యాణమస్తు (అని యాశీర్వదించును).

సాత్యకి— (సింహాసనమలంకరించి) చతురమతీ! మాపెద్దన్నగారు కాన్పించరు?

చతు— అయ్యా! వారింకను రానేలేదు. మీరాక కెదురుచూచుచున్నవారము.

సాత్యకి— ఎందునిమిత్తమో?

చతు— విదర్భదేశవిషయం బేమని యాలోచించితిరి?

సాత్యకి— ఆలోచనమేమియున్నది, వెళ్లవలసినదే కదా?

కృష్ణ— వెళ్లుదమా?

సాత్యకి— వెళ్లుదమనఁగా, నాకర్థమేమియు దోఁపదు. వెళ్లక,

చతుర—వెళ్ళినట్లే వెళ్ళి; వచ్చినట్లే వచ్చుటకాదు. మనశత్రుబలం బంతయు నెక్కడో గుమిగూడును.ఒకజరాసంధుని విషయంబె మనకు ముందు వెనుకలు జ్ఞప్తిచేయుచున్నదిగదా!

సాత్యకి—ఓయీ, చతురమతీ! అటులనా! ఏయేకాలంబుల కేయేయవసర కృత్యంబు లొనర్పవలయునో యవి సర్వవేద్యు లగుమాయన్నగారికిఁ దెలియవలెగాక సామాన్యజనంబులకుఁ దెలియునే! (యని కృష్ణునివంకంజూచి) అన్నాకృష్ణా!

శా. నీమాహాత్మ్యము నీవిధంబనుచు వర్ణింపంగ లేమేము నీ
సామర్థ్యం బెఱుగంగలేక విమతుల్ సాధింపగాఁ జూతురే
కా; మూర్ఖాన్వితబుద్ధి; శాత్రవుల సంగ్రామైక పారీణతన్
వే మర్దించి విదర్భరాట్సుతను సాధ్వీన్ దేగదే యగ్రజా!

దేవరవారికిఁ గోచరింపనివిషయం బిందు మేము యోజింపవలసిన దేమియున్నది? భవదాజ్ఞానువర్తినై మెలంగెదను.') కాలిచప్పుడు వినఁ బెద్దన్నగారు వచ్చుచున్నట్లున్నది. విజయా! యటుబోయి చూడుము.

విజ—అయ్యా! యిదే సమీపించుచున్నారు.

(బలరాముఁడు ప్రవేశించును)

కృష్ణ.—సాత్యకి-చతు.—(పీఠంబులనుండి లేచి నమస్కరింతురు)

బల.—(విజయోస్తు) అనియాశీర్వదించును.)

కృష్ణా! కలహముని చెప్పినవిషయంబు నామనంబును గాఱించుచున్నయది. ఇందుకు నీ వేమి యోచించితివి?

కృష్ణ.—ఇప్పటి కెయ్యదియు విచారంపలేదు. భవదాగమనంబుం గోరి యుందుంటిమి.

బల.—(చతురమతివంకఁజూచి) చతురమతీ!

సీ. చండదోర్దండప్రచండవిక్రముఁడంచు
నెఱుఁగఁడే నను విదర్భేశ్వరుండు

దండిని శాటవే • దాడ కేసరియంచు
తెలియఁడే కృష్ణు ధా • త్రీనరుఁడు
కాండాగమాభ్యాస • ఘనపండితుం డంచుఁ
దలపఁడే సాత్యకి • ధరణివిభుఁడు
దాఁడితారాతిభూ • ధవని కాయుండంచు
గనఁడో కో కృతవర్మ • జనవిభుఁడు,

తే. గీ. ఆత్మలో నించు కేని భ • యంబు లేక
పుత్త్రి సేఁతకు లోఁబడి • పుత్త్రి నస్మ
దీయవైరికిఁ గడుభ క్తి • సేయఁదలచె
యాదవులు శూరవర్యులు • గాదనికద.

సాత్య.—అన్నా ! యాభీష్మకుండును, నాతనికుమార ద్వితీయుం డగురుక్మి రథుండును, మనపరాక్రమం బెఱింగినవారుగనుక నే మనపక్షంబున నే రుక్మితో వివాదం బొనర్చిరి. దీని కంతయు జరాసంధుండును, శిశు పాలుండును, ప్రత్యక్షశత్రువులై రుక్మికిం ప్రబోధించిరి.

బల.—మనకార్యభంగంబు సేయుటకై రుక్మి నడ్డం బిడి వానిని బొమ్మవలె నాడించుచుండిరి. నారదుండు చెప్పుట జూడఁగా మనల, రుక్మి బహుదూష్యోక్తు లాడె నఁట, వానికన్నులకు కావరము హెచ్చినది కాఁబోలు ! విదర్భరాజవంశపారిజాతవనంబునందు నింబవృక్షం బంకు రించె. దీని నిప్పుడే తల్ద్రుంచివేయవలయు. (కోపముతో)

శా. కాఱుల్ ప్రేలి జగద్ధితార్థుల మముం • గర్వించి నీచోక్తులం
దూఱం బల్కినపాపవర్తను నసా • ధుక్ ద్రోహిఁ గ్రూరాత్మునిం
ఘోరాకారరణాంగణంబు జెదరక్ • గోపంబుదీపింప మ
చ్ఛీరాగ్రాహతి వానిమస్తకము వి • చ్ఛిన్నంబుఁ గావించెదక్.

చతు.—ఆ ! వానియాయుష్యము మీచేతిలో నే మూఁడినట్టున్నది.

కృష్ణ.—అన్నగారు వ్రాసిచ్చినట్లు నెఱవేర్చుటయందు సందియంబుగలదా!

చతు.—సందియంబేమియు దోపమగాని జరాసంధపరిపంధిదోర్బలంబునకు భయంపడి యాదవులు దాఁగియుండిరనునపకీర్తిని మాత్రము త్వరలోఁ బాపుకొనవలయును.

బల.—అవును. నీవు చెప్పినది నిజమే! ఎప్పుడైన నే నేమి చేయుదును. ఇదంతయు మాతమ్మునిజయింపమిచే వచ్చినకారణములే. (కృష్ణునివంకం జూచి) ఈనునుం, డిది సమయంబు గాదు నిలునిలుమని రణంబున నన్వెనుకకుఁదీయుచు, నెన్నిపర్యాయంబులు నాకోపంబుపశమింపఁ జేసె. నోరత్తి యనుకొనుటచే తప్పులు మనవిగానే బయటఁబడును. అందుచేఁ జేతకానివానివలె నపకీర్తిని మోయుచుఁ బలుకకుండ వలసివచ్చె.

కృష్ణ—అన్నా! ఆజరాసంధుండు మనభీమసేనుచే వధ్యుండు కావలయునని మన మనుకొనియుంటిమిగదా!

బల—అంతవఱకు చతురమతి చెప్పినట్లు దాఁగియుండవలయునని వేఱె చెప్పనేల? (చతురమతివంకఁ జూచి) చతురమతీ వింటివా! ఇఁక నీవిధంబుగాఁ గార్యము త్వరలో నే చక్కఁబెట్టుకొనఁగలము. శత్రుదౌష్ట్యంబు లెట్లుండినను, తమ్మునిసమయోభంగోక్తులు లెక్కకెక్కువనై యున్నవి.

కృష్ణ—అన్నా నే నేమి చేసితిని? క్షమించి యింకముందు కర్తవ్యమాలోచింపుఁడు.

బల—అంతయుఁ గర్తవ్యమే. దానికిమాత్ర మీవు తక్కువపనిచేసితివా?

కృష్ణ—అదియేమి?

బల—ఏమియులేదు. ఆశిశుపాలభుజంగంబున కీవు బోసినయమృతంబె గదా యింతదూరము తెచ్చినది!

కృష్ణ—అనఁగా నది యేమో జ్ఞాపకంబునకు రాలేదు.

బల—ఇప్పు డెట్లు వచ్చును!

క. మన మేనయత్త సుతునిం
గనె నని కనఁబోనఁ బుత్త్రిఁ గరుణ చిరంజీ
వనుఁ జేయు మనఁగ నోపను
లనువుగ నూఱింటిఁ గాఁతు నంటివిగాదే!

ఇప్పుడైనను జ్ఞాపకంబునకు వచ్చెనదా! ఇంతకన్న నీక నేమి కావలయును? ఏది చూచినను మనపాదబంధమునకు మనమే పాశంబులం గొనితెచ్చుకొనన ట్లున్నది.

కృష్ణు—ఓహో! అఁదుకా. పుట్టినప్పుడె దుష్టబుద్ధియని మన కెట్లు దెలియును. ఆమె మనతండ్రితోఁ బుట్టువనియును, వాఁడు మజ్జనకభాగినేయుండనియు బంధుత్వాభిమానంబుచంజేసి య ట్లాసంగితి. ఇప్పుడుగదా వాఁడు మనకు ప్రత్యక్షశత్రువుగాఁ గనఁబడుచుండెను.

బల—అంద అభిమానాగ్రహ లే. బంధువులే పరమార్థోపకారంబునకుం జనెడువార మగుటచేత నే లోకంబునకంతయు కంటకంబుగాఁ గనఁబడుచుంటిమి. (సాత్యకి వంకఁ జూచి) శైనేయా! యిదంతయు సరే కాని యిప్పుడు విదర్భదేశమునకు రణపటిష్ఠసన్నాహంబుతో నేఁగుటయె మదభిప్రాయంబు (కొంచె మాలోచించి) మ ఱేమియు లేదు గాని భీష్మకుండు మనకు సమాచారంబైనను చేయలేదు. అతండు కార్యభారకుండు గావున వగణీయు లుభయపక్షంబులవారునుం గలసుకొన సంగరంబయ్యెడు ననుభీతిచే నూరకుండెఁ గాఁబోలు! నక్కడ మనకు శిశుపాలాదులకంటె నెక్కువ స్వాతంత్ర్యంబు గల దేమనినఁ బెండ్లికొమరిక మనకృష్ణునియందు విశేషబద్ధాభిలాషయైయున్న విషయంబు ముత్తైఅంగులవారికి సంపూర్ణముగ తెలిసియే యున్నది. పెండ్లికొమరుండు, నిరంతరవనితా సందర్శనలాలసోల్లాసమానసుండగుట మనకె

ల్లరకు విశదంబేకదా ! అందు కారాజకుమారి యభిప్రాయంబు నెఱి వేర్పుట ముఖ్యంబుగాన వివాహప్రయాణప్రయత్నం బొనర్పుఁడు (కృష్ణునివంకఁజూచి) కృష్ణా! నే నింటికిం జని ప్రయాణసన్నాహం బు సేయించెద.

కృష్ణు—చిత్తము. నేనును వచ్చుచున్నాఁడ.

బల—నిష్క్రమించును.

కృష్ణు—తమ్ముఁడా ! సైనేయా ! తగుప్రయత్నం బొనర్చి సేనాపరివారంబు నాయత్తపరుచునట్లు దండనాథుల కాజ్ఞాపింపుము.

సాత్యకి—చిత్తము (అని పోవును).

కృష్ణు—సఖా ! నారదుండు మనకడకు వచ్చి, కుండినపురవిశేషంబులు మనకుఁ జెప్పవని రుక్మిణి యెఱుంగదుగదా !

చతు—మఱేం. ఆమె కెట్లు తెలుసును.

కృష్ణు—చం. పిలువక రాఁడు వృష్ణికులవీరుఁడు తండ్రియు నీ
విశేషముల్, దెలుపకపోయె లగ్న మిఁకఁ దీవ్రత డాసె
నటంచుఁ జింతచేఁ, జెలియ నిజాత్మ నాయెడను జేర్చి మదా
గమనంబు గోరినన్, ఫల మిఁక లేదటంచు విధిఁ బల్మఱు
దూఱుచు నెట్టు లుండెనో.

(కొంచెమాలోచించి) ఇదియేమి హితా ! నాకు వ్యతిరిక్తం బగునూత నార్థంబు పొడకట్టుచున్నది !

చ. జనకుఁడుఁ దల్లియున్ సుతిని చర్చకు లోఁబడి రింక చేది భూ
జనపతి యే వరుండు యదు జన్ముఁ డికేటికి వచ్చు వచ్చినన్
ఘన మగుపోరు గల్గు నిఁక గట్టిగఁగృష్ణునిపొందు మేలుగా
దని తన యన్నమార్గమును దాలిచి నన్విడనాడునేమొకో?

చశు—అయ్యా! నీవు చెప్పినరెండుమార్గములు నాకు నిక్కముగానే తోఁచుచున్నవి. నీకు గడియగడియకు దోఁచుచుండుభ్రమలను జూడ నాకును విభ్రమము దోఁచుచున్నది. మనగొడవ లింక తలంచుకొలఁదిని పరిమితంబులేక తోఁచుచుండును. సౌధరాజమందున విశ్రమించి మఱియునువురిరహస్యంబు లక్కడ వెల్లడించుకొందము రమ్ము (అని యిద్దరును పోవుదురు).



## చతుర్థాంకము.



(ద్వితీయరంగము).

ద్వారకాపురము.

(అగ్నిద్యోతనుఁడు ప్రవేశించును.)

అగ్ని—(నలువంకలంజూచి) భళిరే? ఏమి యీద్వారకాపట్టణ సౌభాగ్యము.

సీ. స్వర్గంబ యని విను • జాడమాత్రమె కాని
ద్వారకానగరవై • భవముఁ గనునె,
యలకాపురము భాగ్య • నిలయమందురె కాని
యిచటిసంపద్భోగ • మచటఁ గలదె,
కైలాస మార్యస • దాలయంబె యటందు
రిందు సాధునికాయ • మంతఁ గలదె,
యజునిపట్టణము ని • త్యానందపద మండ్రు
యీయఖండముదంబు • నీయఁగలదె,

తే. గీ. ఎందుఁ జూచిన వసుదేవ♦నందనాంఘ్రి
భక్తి దీపింప భక్తులు♦ బాడుచుండు
వేణువీణారవాంచిత♦గాన మమరె
నరయఁగా నిది వైకుంఠ♦మనుచుఁ దలఁతు.

ఉ. ఇచ్చటిసౌధరాజములు♦నిచ్చటికుడ్య విచిత్రవైఖరుల్
ఇచ్చటిపుష్పసంపదలు♦నిచ్చటిదివ్యసరోవరంబులున్
ఇచ్చటిపట్టణోపవను♦లిచ్చటిభవ్యసురాలయస్థితుల్
ఎచ్చటఁ గల్గు నీపురవ♦రేందిరవైభవమెంచ శక్యమే.

ఆహా! ఏమివిచిత్రము! ఇన్నియోజనంబు లహోరాత్రంబులు నడచివచ్చిన నామార్గాయాసంబంతయు నీద్వారకానగరసందర్శనోత్సుకంబుచే దేహంబు పరవశత్వమొంది యెచ్చటికో యరిగినది. [అత్యంతానందసందోహంబు డెందంబున బ్రవాహంబై తోఁచె. నిచ్చటికి సులభంబుగానే వచ్చితి నింకముందు దేవకీగర్భాంబుధిరాకాశరదిందుమూర్తిని సేవింపవలయుఁగదా! యది సులభంబుగా నెట్లు సంఘటించునో తెలియదయ్యో. ఈమహాత్ముని దివ్యమాహాత్మ్యతత్త్వంబు వాగగోచరంబని దేవమునిపుంగవుం డప్పుడప్పుడు చెప్పి యానందించుచుండఁగా విని తన్మయత్వంబుఁ జెందుచుంటిని. ఇంతకు నాప్రాప్తం బెట్లగునోగదా?

చ. ధరణిని రక్కసుల్ ప్రబలి♦తాపసవృత్తుల నాక్రమింపఁగా
సరసిజజన్మసంస్తుతుల♦సంతసమంది దురాత్మసంఘసం
హరణ మొనర్ప సత్కృప ని♦జాంశమునన్ వసుదేవదేవకీ
వరసుతుఁడై జనించెముని♦వంద్యుఁడువిష్ణుఁడుచిన్నికృష్ణుఁడై!

ఆమహానుభావుం డగుశ్రీకృష్ణుని సౌధరాజం బిక్కడి కెంతదవ్వుండునో? (ఉపరిభాగంబు వీక్షించి) యల్లదే! మధ్యందినమార్తాండప్రభాభాసితంబై, రత్నసోపానవిరాజితంబై, కన్నులకు మిఱుమిట్లుగొల్పుచున్న యది, ఇదియే

యయియుండునా? ఏదెస వీక్షించినను తన్మయంబుగాఁ దోఁచుచున్నది. ఇందేదియో తెలియరాదయ్యె. భళిరే! నాపుణ్యవశంబున నెవ్వరో యిరువురు మహానుభావులు సంభాషించుచు నాదెసనే వచ్చుచున్నవారు. వీరికృపం బడసి, యిరవు దెలిసికొనెద. సుగుణాత్ములారా! మీరు దీర్ఘాయుష్మంతు లగుదురుగాక. (అనికూర్చుండును)

(జయ విజయులు ప్రవేశింతురు).

జయుఁడు—విజయా! ఇందెవ్వరో మనోవితర్కం బొనర్చుచు మనల నాశీర్వ దించుచున్నవారు.

విజ—(దగ్గరకు వచ్చి చూచి) ఈమహాత్ముండు వృద్ధుం డగుబ్రాహ్మణుండు గా నోపును.

జయుఁ—అయ్యా! మీరెవ్వరు? ఎక్కడనుండి మీరాక.

అగ్ని—నేను బ్రాహ్మణుండను, కుండినపురంబుననుండి.

విజ—విదర్భదేశమందలి కుండినపురమా?

అగ్ని—అవును.

విజ—ఎందునిమిత్తమై విచ్చేసితిరో?

అగ్ని—శ్రీకృష్ణదేవుని దర్శనార్థము.

జయుఁ—అయిన నిక్కడ మసలెద రేల?

అగ్ని—ఆయదునందనునిమందిరంబుఁ గానక మీసందర్శనంబునంజేసి తన్మా ర్గం బెఱుంగఁ గోరి యిందుఁ గూర్చుండితి.

జయుఁ—విశేషంబులేమైన మాకుం జెప్పవచ్చునా?

అగ్ని—అయ్యా! మీరెవరు?

జయుఁ—మేము శ్రీహరిసేవకులము.

విజ—జయా! యీవిషయం బిక్కడ నడుగ నేల?

జయుఁ—ఆ! ఊరక యంటిని.

అగ్ని—కరుణించి నన్నాతనిసన్నిధికిం జేర్చెదరా?

విజ—అభ్యంతరమేమి ? మావెంట దయసేయుఁడు.

అగ్ని.—కరుణతో మెల్లగా త్రోవఁ జూపుఁడు.

విజ—మెల్లమెల్లఁగానడచి రండి (అనియందఱుఁ బోవుదురు).

## చతుర్థాంకము.

(తృతీయరంగము)

(శ్రీకృష్ణుఁడు తల్పంబునఁ బవ్వళించియుండును.
చతురమతి ప్రక్కను గూర్చుండియుండును.)

కృష్ణ—ఉ. నెయ్యమువీఱ నాయనుఁగు॰నెచ్చెలి నన్విడనా
డి యన్యునిక్, జయ్యనఁ గోరజూచు ననుఁ॰సంగతి నామదిఁ
దోఁచి చేతిచే, నుయ్యలఁబట్టి యూఁచుగతి॰నుల్లము త్రొ
క్కుపడంగఁ॰జొచ్చె నా,తొయ్యలిఁదెచ్చుమార్గమెటుఁ॰దోఁ
చదు చెప్పగదయ్య మిత్రమా !

చతు—నెచ్చెలీ! నేను నీకు చెప్పవలసినయుపాయం బేమియున్నది? చతు
రంగబలములతో విదర్భదేశమునకుం జని, శిశుపాలాదులం జయించి
రుక్మిణిం దెచ్చుటయకదా మార్గంబు. ఇంతకన్న నెంతయుపాయం
బేమియున్నది.

కృష్ణ—అది నీకుం జూడ సులభోపాయంబుగాఁ దోఁచెనా బలాబలంబుల
తారతమ్యంబులు నీ కేమి తెలియును.

సీ. దుర్నివార్యం బైన॰దోశ్శక్తిగలయట్టి
నరపతి దమఘోష॰నందనుండు

అనిశంబు నాపయి • నలుకఁ బూనినయట్టి
బలశాలి మాగధా • వనివిభుండు
సంగరమన్న లెం • క్కంగొనఁ డాసాల్వ
డరయఁగా నఖలశ • స్త్రాస్త్రవేది
కావరంబున వాసు • దేవుండ నే నని
పదరుచుండెడువాఁడు • పౌండ్రకుండు,

తే. గీ. వారినందఱ నిర్జించి • బాలఁ దెత్తు
మనుట సులభంబొకో • నాదు మనసునందు
సందియం బియ్యుదోఁచెను • సఖుఁడ దీని
కేమి జెప్పెదొ సదుపాయ • మెట్టిజాడ.

చతు—కృష్ణా! నీ విట్టిపిటికివాఁడ వనుసంగతి నా కిప్పుడు తెలిసె నీ కిప్పుడు గల్గినసందియంబు పగఱఁ జయింపలేననియా? రుక్మిణి నిన్ను వరింపదనియా? తెల్పుము.

కృష్ణు—ఈరెండువిషయంబులు కొంచె మాలోచనీయంబులే.

చతు—అటులనా! నీవుఁదోఁచిన యభిప్రాయమంతయు, వట్టిబూటకం బని నాకు దోఁచుచున్నయది.

కృష్ణు—ఎందువలన?

చతు—కారణంబులు నీవలె నాకేమి తెలియును!

సీ. కూనవై నాతిని • బ్రాణంబుఁగొనుటయు
కొండికవై బండిఁ • గూల్చుటయును
బాలుఁడవై తృణా • వర్తుఁ జంపుటయును
ధేనుకాసురుని వ • ధించుటయును
ననిలోన వ్యోమసు • శాటుఁ దున్నుటయును
బకుని సంగరమున • వ్రచ్చుటయును

వృషభాసురునిఁ బడఁ వేసి మోఁదుటయును
కేశిమదం బడఁగించుటయును,

తే. గీ. మల్లులను గొట్టి కంసునిఁ మద మడంచు
చందములు మున్ను నీ కెట్లుఁ సంశయములొ
యష్టసంధియములఁ గొనిఁ యరులఁ గెల్చి
వెలఁదిఁ గొంచును రావయ్యఁ పెండ్లికొడుక.

ఇంక దేవరవారొనరించినదివ్యలీలలం గొన్నింటి నుడివెదఁ జిత్తగించెదరా!

కృష్ణు—(నవ్వుచు) నీయభిప్రాయంబుఁ దెలిసికొనుట కట్లంటివిగాని యందు కా! పుట్టువులన్నియు లెక్క పెట్టుచుంటివి.

చతు—అవునవును. నీ వన్నియు తెలియనివానివిధంబున నటించుచుందువు. అవి యప్పుడే తేటతెల్లమవుచుండును. ఓహో! నీసంశయ మిప్పుడు నాకు తెలిసినది. మేనత్తకొమరునిఁ బోరుట కిష్టపడకుండుట గాఁబోలె. అయినను, మేనమామం జంపినవానికి నీకి దెట్టిసంశయంబు.

కృష్ణు—ఏమట్లంటివి? నే నెప్పుడును, బంధు మిత్ర శత్రుత్వంబులను సమానములుగ నే యెంచుచుందునుగదా! గుణంబులంబట్టి వ్యవహరించు చుందును.)

(విజయుఁడు ప్రవేశించును)

విజయు—అయ్యా! విదర్భదేశంబునుం. వృద్ధబ్రాహ్మణుండొకఁడు భవత్సందర్శనార్థమై వచ్చియుండెను.

కృష్ణు—(తొందరపాటున) ఏమీ? విదర్భదేశమా! బ్రాహ్మణుఁడా! యేఁడీ? యెచ్చటనుండెను. (అని లేచి కూర్చుండును).

విజయు—అంతఃపురంబునకు దేవర సెలవుపొందినపిదప తోడితెచ్చెదమని ద్వారముకడ నిల్పివచ్చితిని.

కృష్ణు—అభ్యంతరములేక తోడ్కొనిరమ్ము.

జయు—చిత్తము—(అనిపోవును).

కృ—చతురమతీ! విదర్భదేశమా! నిజమా! ఇదేమైయుండును.

చతు—ఇది మరేమియు గాదు. పెండ్లికొమరుండవై వేంచేయుమని శుభ లగ్నపత్రికవచ్చె. అబ్బా! నీయనుమానము కొంచెము తీఱిపోయినది గదా! ఇంకనైన నన్ను నిద్రపోనిమ్మ.

కృష్ణ—అదే యయియుండునా!

చతు—ముందుగా నంత త్వరపడెదవేలనయ్యా? రానిమ్మ.

(అగ్నిద్యోతనుఁడు విజయునితోఁ బ్రవేశించుచు)

అగ్ని—(వచ్చి దూరంబున నిల్చి కృష్ణునిం జూచి)

మ. కనుఁగొంటి న్శరదిందుసుందరముఖు౯ ♦ గాలాంబుదశ్యాము
ని౯, వనజాతాయతలోచను న్సరళభా ♦ స్వచ్చారుగండస్థ
లు౯, ఘనవక్షు న్గురుబాహుఁ ♦ గంబుగళుని౯ గాంగేయ
దివ్యాంబరు౯, సనకాదిస్తవనీయపాదయుగళు౯ ♦ సాక్షాద్ర
మావల్లభు౯.

సీ. మత్స్యమై సోమకు ♦ మడియించి వేదముల్
విధి కొసంగిన మేటి ♦ వేల్పితండె
కూర్మమై మందర ♦ కుధరమెత్తి సురాళి
కమృత మొసంగినహరి ♦ యితండె
కిటియై హిరణ్యాక్షు ♦ చటులదేహముఁ జించి
ధర నుద్ధరించిన ♦ పరుఁడితండె
నరసింహుఁడై హిర ♦ ణ్యకశిపు వధియించి
బాలుఁ బ్రోచినజగ ♦ ద్వ్యాపి యితఁడె,

తే. గీ. వామనుండును భృగుకుల ♦ రాముఁ డగుచు
దాశరథియయి హలియయి ♦ తనరి బుద్ధ

కల్కిరూపములను బొందిఘనత జెంది
యుండు వైకుంఠనారాయణుండితండె. ]

(అనిముందుకు నడచును)

కృష్ణు—(తల్పంబునుండి లేచి వేగముతో వచ్చి) భూసురోత్తమా! వందనము లాచరించుచున్నాఁడను. (అని నమస్కరించును)

అగ్ని—(నవ్వుచు)

తే. గీ. జీవకోటికి శుభములఁ జేర్పు నిన్ను
గాంచి యేమని యాశీర్వదించువాఁడ

నయినను,

దయ విదర్భనికూఁతును ద్వాహమాడి
పెండ్లికొమరుండ వగుచు వేయేండ్లు మనుము.

(అనియాశీర్వదించును.)

[చతు—ధరణీసురాశీర్వచనప్రభావంబు మాకృష్ణునికి సకలార్థంబు లొసంగుం గాక.

కృష్ణు—తే. గీ. ధారుణీసురులే మాకు దైవతములు
వారివాక్యాళి మాకు శుభప్రదంబు
గాన భూదేవ నేమిమ్ముఁ గనుటచేత
నుత్సవంబును జెంది ధన్యుండ నైతి.]

అగ్ని—యాదవేంద్రా! భవద్దయావిశేషంబుచే మాబోంటివారలు ధన్యత్వంబు నొంది సుఖాత్ములై యుండవలెనుగాని మమ్మంతగా గౌరవింప మేము భరించగలమా!

[సీ. బమ్మనుగన్నట్టి తమ్మిపొక్కిలివాని
కమ్మవిల్తునిఁ బోయఁగమ్మువాని

నెమ్మికన్నులు తల • సొమ్ముగాఁ గలవాని
ఱొమ్మున మెఱ్ఱలతి • సొమ్మువాని
నమ్మినవారల • నెమ్మిఁ బ్రోచెడివాని
యిమ్ముగ పక్కిగు • ఱ్ఱమ్మువాని
కెమ్మోవిజిగిపగడమ్ముఁ • బోలినవాని
నమ్ము లేనక్కటి • కమ్మువాని,

తే. గీ. నిన్ను సేవించి సంతోష • నీరరాశి
మునుక లేయుచునుంటినో • వనజనాభ
ధన్యతమ మయ్యె జన్మమో • దనుజహరణ
పరమహాసేంద్రసద్వ్రాతి • పారిజాత.

మాధవా! విదర్భరాజనందన త్వదీయసుందరలావణ్యరూపంబు వరించుటం జేసి మూర్ఖుం డగురుక్మి శిశుపాలాదివిరోధివ్రాతదుర్బోధనంబుచేఁ దండ్రిమాటల లెక్కింపక యామెను శిశుపాలునకే యియ్యందలంచి యెల్లుండి లగ్నంబు నిశ్చయించి చేదిపురంబునకు కబురంపె. తద్వృత్తాంతం బాసుగుణవతి విని విన్ననై యాహారంబు నొల్లక పరితపించుచు సఖీపరివృతయై నన్నంతఃపురంబునకు రావించి తనసందేశంబు దేవరవారి కిట్లని విన్నవింప నన్ను బుత్తెంచె నది దివ్యచిత్తంబున నవధరింపవలయు.

సీ. సుందరశోణార • విందసన్నిభము లౌ
చరణయుగ్మములకుఁ • శరణ మనుము
బృందావనాంతభూ • విహరణశ్రమ మొందు
నడుగులకుఁ బ్రణామ • మిడితి ననుము
కాళీయుశిరములఁ • గంద నృత్యము సల్పు
పదముల కిడె నమః • పదము లనుము

చామరధ్వజహలచక్రరేఖల నొప్పు
నంఘ్రులకు సదాం జోహారు లనుము,

తే. గీ. పావనంబులు నిఖిలసద్భావహములు
మోదములు సేవకాళికిముక్తిదములు
వేదసారము లాశ్రితశ్రీదములును
నైననీపాదములు మదిం బూనెననుము.

సీ. నిన్ను గామించినకన్నె యీయన్నులమిన్నఁ
గైకొను సుప్రసన్న యనుము
నిన్ను గాకన్యు నేఁ గన్నులఁ గననొల్ల
నన్నేలు మోప్రాణనాథ యనుము
పన్నగశాయి యీపన్నురాలిది దీని
విన్నపము విను గోవింద యనుము
చిన్నది నీపై నిగన్నులుంచెను కావఁ
గ్రన్నన రా సుగుణాఢ్యయనుము,

తే. గీ. అన్నపంతంబు సున్నయైచన్న దాఁక
నిన్ను గని త్వత్కరంబు బూఁతఁ గొన్నదనుక
యన్న మొల్లదు నిద్దుర యనదు మిగుల
ఖిన్నయై యున్న దిప్పుడు కృష్ణ యనుము.

(అని జాబు చేతికిచ్చి) మహాత్మా! యీ త్వరసంరక్షణంబున కిదియే యదనుగాన విచ్చేయుఁడు. దేవిగా రంపినయీరహస్యలేఖనముఁ జిత్తగించవలయు. మఱియు,

ఉ. ఆడదు తోడినెచ్చెలులయందనురాగముమీఱఁ గూడిమా
టాడదు తల్లితోఁడఁబడు కాడదు తండ్రియెయ్యఁ బిల్వ భూపలన్
జూడదు చోకప్పుడున్ దోడుగ సొంపుగ నేర్చిన పెండ్లిపాటలన్
పాడదు తోయజాక్షి శిశుపాలుని నామము విన్న దాదిగాన్.

కృష్ణా! విదర్భరాజపుత్త్రి త్రికరణంబుల భవత్కైంకర్యంబె కోరియున్న యది.

కృష్ణు—భూసురాగ్రణీ! ఆబాల నాయందవిచ్ఛిన్నాత్యంతభక్తియోగం బునంజేసి పరితపించుచున్నదిగాన, దీనిం బ్రోచుట కర్తవ్యంబ యని నేనును త్వరితపడుచున్నాఁడను.

అగ్ని—(తనలో) ఇప్పటికి నాకష్టంబు ఫలించె. సఫలకార్యుండనైతి. (ప్రకాశముగా) వాసుదేవా! దయాగసప్రవాహంబె రూపంబైన నిన్నెవ్వరు వినుతింప నేర్తురు? నీదివ్యలీల లిట్టిని వినుతింప నే నెంతవాఁడను.

సీ. విధి మాయ గోగోప♦వితతిఁ దాఁచిననాఁడు
ప్రతిరూపముల వహిం♦చితివి నీవు
బలభేదికురియించు♦శిలలు నివారింప
శిఖరిని గొడుగుగాఁ♦జేసి తీవు
మన్ను దింటివె గను♦మాయమ్మ యని నోట
బ్రహ్మాండముల గనఁ♦బఱచితీవు
వృక్షరూపముఁ గన్న♦యక్షేశసుతులకు
నిజరూపు లిచ్చి మ♦న్నించి తీవు,

తే. గీ. కరుణచే నందుమందలఁ♦దిరిగితిరిగి
కట్టుబట్టక తొట్టులఁ♦గాఁచి తీవు
నీవిలాసంబు నీశక్తి♦నీమహత్వ
మభినుతింపఁగ రుద్రున♦కైనఁ దరమె.

అదియునుంగాక త్రిలోకంబులజనంబులకు నీదివ్యాకారంబెగదా పరమసేవ్యంబు. నీదివ్యనామస్మరణంబె నిఖిలపాపోన్మూలనంబును భక్తజనులకు కామితార్థప్రదంబును నగు.

సీ. కలుష శైలావళిఁ◆ బొలిమ్పఁ గులిశంబు
కృష్ణ నీనామసం◆కీర్తనంబు
శత్రుభూతంబుల◆ శాసింప దివ్యమం
త్రంబు నీనామాక్ష◆రద్వయంబు
సంసారపతితాంధ◆జనుల కంజనముకం
సారి నీవిమలనా◆మామృతంబు
ఆపత్సముద్రము◆గ్నార్తులఁ దరిఁ జేర్ప
నావగదా భవ◆త్సేవనంబు,
తే. గీ. జననమరణాదికంబు లీ◆జంతువితతి
ననుభవింపఁగఁ జేయున◆నాదికర్మ
వాసనారణ్యమును గాల్ప◆వహ్నిగాదె
చిత్ర మానీదుచారిత్ర◆చింతనంబు.

కృష్ణు—అయ్యా! బ్రాహ్మణోత్తమా? మీరు కుండినపురం బెప్పుడు వెడలితిరి?

అగ్ని—కేశవా! నిన్నటిసూర్యోదయకాలంబున.

కృష్ణు—అయ్యో! నానిమిత్త మింతదూరము చాలాప్రయాసపడి నడచివచ్చితిరి. మీకేమి ప్రత్యుపకారంబుఁ జేయనేర్తును?

అగ్ని—పురుషోత్తమా! నీవచనంబే నేను పదివేలమహోపకారంబులుగా భావించెదను.

కృష్ణు—మిత్రమా! చతురమతీ! నీవీభూదేవోత్తము మద్గృహంబునకుం దోడ్కొనిపోయి మార్గాయాసంబుదీఱునట్లు శుశ్రూషలం దృప్తునిం జేయుము. నే నిదే వచ్చెదనుపొమ్ము.

చతు—(అగ్నిద్యోతనునితో) స్వామీ! తిన్నగా నావెంటఁ దయచేయుఁడు.

అగ్ని—అటులనే (అని యిరువురుపోవుదురు).

కృష్ణ.—ఈజాబునం దేమిసంగతులు వ్రాయఁబడియున్నవో చదివిచూచెద
(అనిజాబు చదువును).

దండకము.—శ్రీమన్మహారాజరాజార్చితా దేవకీపుత్రకృష్ణా భవద్ది
వ్యపాదారవిందద్వయం బింపుమీఱంగ నాయంతరంగంబు
నందుం బ్రతిష్ఠించి భక్తిం ద్రికాలంబులందుం సహస్రప్ర
ణామంబు లర్పించి నేఁ జేయువిజ్ఞాపనం బేమనన్ దేవలోకా
వనార్థం బమోఘాద్భుతంబైన నీసంభవం బేకదా కారణం
బౌటచే త్వత్ప్రసాదార్థినై నేను క్షేమంబుగా నున్నదానన్
హరీ మత్కరగ్రాహకౌతూహలాయత్తవృత్తం బపేక్షించు
నాకున్ భవత్క్షేమయోగంబుఁ దెల్పంగదే వేగ రాజీవపత్రే
క్షణా నేమనోవాక్శరీరంబులందుం గ్రియాకర్మకర్తృత్వమం
దుం జగన్మంగళాకారమై యొప్పునీరూపముం దక్క నన్యంబు
గోరన్మనం బొప్ప దో కేశవా! భాసురంబైన నీహాసలీలావి
నోదాద్యవైచిత్ర్యచారిత్రలం దుంచుభావం బహో యన్య
దుర్భావితులందుం బడం బోవునే సుందరా మందరోద్ధార
వందారుమందారభూజా జగత్కల్పనోద్ధారనాశంబులం
జేయ నీలోకమం దుద్భవంబైతి గాదే విశిష్టారిసంఘంబులం
బ్రోచుటల్ నీకుధర్మంబ గాదే సదా నీకుపాదాబ్జకైంకర్యమే
గోరితిన్ సర్వశేషీభవచ్ఛేషభూతంబనై నట్టినన్నుం దయం
జూడు మో శౌరి చైద్యాదిశత్రువ్రజంబుల్ మహాగర్వదు
ర్వారులై కాఱులం బ్రేలుచున్ వచ్చినన్ జేరనున్నా
రయో వారి శాసించి మత్పాణిపంకేరుహం బట్టి చేపట్టవే
వేగరావే కృపాంభోధి నన్నావవే శత్రులం ద్రోలవే భద్ర
మూర్తీ లసచ్చంద్రకీర్తీ ధరిత్రీసురు న్బంపితి న్నాదుసందేశ

మఱి విన్నవింపం దదాలాపములే వీనులం బెట్టి సన్నేలు
మోశంఖచక్రభూషా కనద్దివ్యవేషా ప్రపన్నైకపోషా
నమ స్తే నమ స్తే నమః.

శా. శ్రీవైకుంఠవిలాసముల్ సతతల క్ష్మీయుక్తసంచారముల్
దేవారిప్రకరాపహారములు సందీప్తార్థముల్ సుప్రబో
ధావాసంబులు సత్ప్రభావములు భక్తాభీష్టదంబుల్ పృథ
గ్భావాగమ్యములే నెఱుంగనివియే కాంతా!భవజ్జన్మముల్.

ఇట్టి దివ్యం బగు దేవరసందర్శనంబుఁ బ్రతీక్షించుచున్న నామీఁద విలంబనము సేయక వేగంబుగా విచ్చేయవలయు. తావకవియోగసంతాపం బింతింతనరాని వెతలం బెట్టుచున్నయది.

ఉ. నీ విటు రానితత్క్షణము నీరజనేత్ర! విషంబుఁ గ్రోలి యో
పావనశీల వేదవతిభంగి మనోవ్యథ నగ్నిఁ జొచ్చియో
యీనవపుర్ద్వ్యజింతునిది యేకదునిక్కమటంచునమ్ము మో
దేవకీపుత్ర సకదసి దేకద ప్రాణసఖిః భరింపఁగన్.

ఈనారి నన్నే ప్రాణపదంబుగా నెంచి మత్సమర్పితసర్వప్రాణమై మిగుల నార్తిం జెందుచున్నది. గావున వేగంబునం జని పాణిగ్రహణం బొనర్చెద. ఓహృదయమా! తొందరపాటు వహింపకుము. నీజీవితేశ్వరిని కన్నులారం జూడఁగలవు. (కొంచెమాలోచించి) ఎవరురా అక్కడ.

విజ—అయ్యా! యిదే వచ్చితిని.

కృష్ణు—నీవు తక్షణం బరిగి సాత్యకితో సైన్యంబుల నిప్పుడే ప్రయాణంబు సేయింపు మని చెప్పుము.

విజ—అయ్యా! సర్వసిద్ధులై తమరాకకు మనవా రెదురుచూచుచున్నవారు.

కృష్ణు—అయిన నిదే వచ్చుచుంటిని. (అని పోవును).

శ్రీ ర స్తు.

శ్రీగోపాలకృష్ణపరబ్రహ్మణే నమః.

---

# రు క్మి ణీ ప రి ణ య ము.

## ప ం చ మా ం క ము.

(ప్ర థ మ ర ం గ ము)

భీష్మకాంతఃపురము.

✣ భీష్మకుండును, సత్యశీలయు నుందురు. ✣

సత్య—చిరకాలంబున కైదుగురు మగబిడ్డలవెనుక మన కబ్బురంబుగాఁ బుట్టినబాలికారత్నం బిట్లు మనఃక్లేశంబు నొందుచుండ మీరుపేక్షచేఁ బెద్దకొడుకుమాటలకు లోఁబడి యీప్రయత్నంబున కిష్టపడవచ్చునా!

భీష్మ—కాంతామణీ! నీవంతయు వినుచునే నన్నిట్లాడిన నే నేమిచెప్పఁ గలవాఁడను.

తే. గీ. దుహితృమానసకుముదంబు • తోష మంద
నంద మానందతనయాన • నేందుదర్శ
నం బొదవు నంచు నే ప్రమ • దంబు నొంద
నగ్రసుతుఁ డట్టె రాహువై • యాక్రమించె.

ఇట్టికుమార్గవర్తి యగుకొడుకు నే నెట్లు వినిపింపనేర్తును.

సత్య-చ. అనయము దేవకీతనయుఁ • డల్లుఁడు గాఁగలఁ డంచు
నామనం, బున కడుసంబరం బొదవి • ముచ్చటలెల్లను
మీఱియుండనే, మనుచుఁ దలంచి మీతనయ • కాయువు

లేనిమహీశుఁ గూర్చునంచని కొమరుండు బల్కు విని॥
హాయిగ నెట్టులు నూరకుంటిరో.

(అని కన్నీరురించును)

భీష్మ—నాకు తెలియక యూరకున్న వాఁడఁగాను. జీవితేశ్వరీ! మించి కొడుకులు సె స్తనంబు వహించినప్పుడు జననీజనకులమాటలు లెక్కసేయుదురా? నాహృదయంబు లోలో నెంతకృశించుచున్నదో నీకుమాత్ర మేమి తెలియును. ఇప్పుడు చింతనొంది మన మేమి చేయఁగలము. మిగిలినపనికి వగచిన నేమిలాభము?

చ. మునుపటిబామునందు మన॥ముద్దులబాలిక యెట్టిపూజచే
సెనొ జననంబు నాఁడు ముఖ॥సీమను ధాతయు నెట్లు వ్రాసెనో
కనుటకుసాధ్యమా నెచెలు॥కన్నులబాష్పకణంబులుర్లఁగా
వనటను బొందిసన్నిటుల॥వ్యాకులపెట్టుట నీకుఁ బాడియే.

సత్య—నాథా! మీకు నేను చెప్పవలసినంత దానను గాను. అయినను నామనవి నొక్కటి నవధరింపుఁడు.

భీష్మ—అదియేమియో చెప్పుము.

సత్య-చ. హితమును గాని కార్యమిపు॥డిట్టులఁ జేయఁగనేల భ
ద్రసం, స్థితిదివసంబులే గుఁకను॥ చేసుటకుండునె యీ
ముహూర్తపద్ధతి మిషనూని నిల్పఁగదె॥ దైవము ముం
దెటులొందజేయునో, మతిని దలంచి చూడు మను॥
మానము నొందక ప్రాణనాయకా.

భీష్మ—(కొంచెమాలోచించి) శిశుపాలునికి నాయెదుర శుభలేఖ నంపుచుండఁగా నేను జూచి లగ్నంబునకు కావలసినపనులన్నియు సమకూర్చుట యెఱింగి యిప్పుడేకో మిషచే నే నెన్ని జెప్పినను వాఁడు నమ్మునా! వాఁడేవైన నీముహూర్తంబునకే కార్యంబు తప్పక

చేయఁగలవాఁడు. నీమాట లిప్పుడు నాకసంగతంబులుగాఁ దోఁచె. నీవు చెప్పినట్టె నొకవేళ సమర్థించినను నీయభిప్రాయంబాపైన నెట్లు జరుగవలయునో చెప్పుము.

సత్య—చెప్పవలసిన దేమి ?

తే- వె. కృష్ణుచేత వాఁడు • గీటడంగు నటంచుఁ
దెల్పఁగాదె మున్ను • దేవమౌని
యంతదనుక జూచి • యబల నాహరికి ని
సంగి పెండ్లి సేయఁ • జనదె నాథా !

భీష్మ—ఆహా ! నీమనం బెంతదీర్ఘాలోచనసమగ్రంబై నదే ! దైవతంత్రం బెట్లు పరిణమిల్లునో యట్లే జరుగఁగలదు. కావున మనమట్టిదురభిప్రాయమును పొందరాదు. అప్పటికైనను మనవారిమన్మతంబు ద్రిప్ప నసాధ్యంబై యుండుఁగదా !

సత్య—అన్ని సంకటంబు లొకదాని వెంట మఱియొకటి యటులనే చక్కఁ బడఁగలవు.

భీష్మ—ఔరా ! నేనిప్పుడు కొమరునిమాటలకు లోఁబడె ననునపవాదంబు గాక తుదకు నీమాటలుగూడ నాకు ప్రతిబంధకంబులుగాఁ గన్పట్టుచున్నవి. అదియునుంగాక స్త్రీబుద్ధి లెప్పుడును ప్రళయంబునే సూచించుచుండు ననిచెప్పుటచే నాకు నేమియుం దోఁచకున్నది. నేనేమియుఁ జెప్పంగలవాఁడఁగాను. నీకొమరుండును నీవును జక్కఁగా నాలోచించి యే దెట్లు చేయవలెనో యట్లే యొనర్పుఁడు. నే నికార్యపర్యవసానంబు వీక్షించి యరణ్యంబునకుఁ దపంబున కేఁగుటకు నిశ్చయించుకొంటిని. ఇఁక నీయిష్టము. (అనిపోవును.)

సత్య— ఈమానవేంద్రుండు కుమారునికి లోఁబడి పుత్రమోహంబుచే నేయత్నమును పూనక యున్నవాఁడు. నే నెట్లుండిన నేమి ప్రయోజనము. విరించికృత మెట్లగునో యట్లే జరుగఁగలదు.

ఆ- వె. సుతులు సుతు లటంచు • సతులు దలంచుచు
పరితపించి వ్రతత • పస్స్వితులను
గందు రందు సుగుణ • గణ్యులై పితరుల
సుఖులఁ జేయనట్టి • సుతులు సుతులె.

(అని పోవును.)



## పంచమాంకము.

---

(ద్వితీయ రంగము.)

కుండినపురోద్యానము.

రుక్మిణి, చంద్రకళ, కీరవాణి అందుందురు.

రుక్మిణి—చెలీ! చంద్రకళా! ఈరసాలవృక్షం బింతలో నెంతసుందరంబై శోభిల్లుచున్నది?

చంద్ర—అమ్మా! ఇది యిన్నాళ్లిదనుకఁ గృశీభూతంబై యభివృద్ధిదంబు లగుశుశ్రూషలు గావించినందున మిగుల వన్నెకెక్కె.

[ఆ- వె. ఎట్టిదానినైన • గట్టితలంపుతోఁ
బట్టుబట్టి మిగులఁ • బాటుబడిన
వృద్ధియయి తనంత • వికసనమును జెంది
ఫల మొసంగుఁగాదె • పడఁతిమిన్న.]

రుక్మిణి—సఖీ! ఈయతసీకుసుమసముదాయం బింద్రనీలమణులవలె నెంత ప్రకాశించుచున్నదో చూడుము.

చంద్ర—అది నీమనోవల్లభుని తనువికాసంబును ధిక్కరించుచున్నది.

రుక్మిణి—అలివేణులారా! ఈవనప్రవిమలస్థలంబు నాకేమో యొకవికారం
బును గలిగించుచున్నది.

చ. మలయసమీరమియ్యెడసు◆మంబులపొందొనరించిఘ్రాణసం
కలనముఁ జెంది ఘుమ్మునను◆గమ్మనితావులు జిమ్మె కోకిలం
బులకలనాదముల్సెలఁగెఁ◆బూవిలుకాని హుమాయిపాళిసం
కులరవమెచ్చెఁజిత్తజుఁడు◆కోలలఁగ్రుమ్మెఁగలంగెఁజిత్తముల్.

చంద్ర—(తనలో) అయ్యో! సమయము తప్పివచ్చినది. గోవిందుని జ్ఞప్తికి
తెచ్చుటచే మోహంబుద్భవిల్లి మనసిజబాణంబులఁ గలంగుచున్నయది.
కాన నీమెమనం బేవొప్రసంగవశంబున మఱల్చవలెను.

రుక్మిణి—సఖులారా! మనోజశరావిద్ధంబై మచ్చిత్తంబు తత్తరపాటు
వహించుచున్నయది. నామనోహరుం డెప్పుడు రాగలండు?

ఉ. ఎప్పుడు రాగలండు వన◆జేక్షణుఁడో చెలులార యింక యీ
తెప్పర మెట్లు దీరు జను◆దెంచినను౦ గరుణించి నావ్రతం
బొప్పఁగ దీర్చుఁ దీర్చి పర◆మోత్సవ మొందగఁ బెండ్లియాడు
నే నెప్పుడుగాంతు వైభవజి◆తేంద్రుఁ గృపాగుణసాంద్రు
నిన్ హరిన్.

చంద్ర— అమ్మాయీ! అంతత్వరపడెదవేల? తప్పక నప్పంకజాక్షుండు
రాఁగలండు. నీమనోవిభ్రమం బడంచికొని, యీమల్లికాసమూహం
బులం జూడుము.

శా. ఈలేమల్లియగుంపు లింపుగను◆ తా మేప్రొద్దుమాకందశా
ఖాలాలిత్యముఁ గోరి తత్తరువుఁ బ్రాఁ◆కంబోవుచో నింతలో
లీలం గ్రాలెడుచండమారుతుని కే◆ళిప్రోద్ధతిన్ దూలి యీ
నేల న్వ్రాలెఁగనుండె నీవలె నెత◆న్వీ! యీదెసం జూడుమా!

రుక్మిణి—(పద్మనాభవృత్తము):—

నామానసవిహారిం గూడియుండక నింక • నామేనఁ బ్రాణంబు లేటికి నిల్పుదానన్,

చంద్ర—కామారివినుతుం డిదె వచ్చు వేగంబ • కాంచెదవు సంతోషకాల మిదో వచ్చెన్,

కీర—భూమీసురుం డటకుఁ బోయె రేపిట వచ్చుఁ • బూఁబోఁడి యింతలో వగవంగ నేలే,

రుక్మిణి—కామార్థముల నిచ్చుకంజాక్షు నిం బ్రీతిఁ • గాంచు భాగ్యోన్నతియుఁ గల్గునే త్వరలోన్.

చంద్ర—రాకుమారీ! అదే సూర్యుం డస్తమించుచున్నాఁ డటు చూడుము.

మ. అనయంబున్ హితవృత్తిబూనిభువనా • హ్లాదానుసంధాయియై
తనమిత్రాఖ్య ప్రసిద్ధమైనెగడ నే • తద్వృత్త మాద్వారకా
వనుఁ డాకృష్ణునిఁ జూడవేగమున జె • ప్పంబోయె నాపశ్చిమాం
బునిధిం జొచ్చెను భానుబింబ మదె సం • ఫుల్లాబ్జపత్రేక్షణా.

రుక్మిణి-తే-గీ. రాజు పుట్టఁగ లేదు స్వ • రాజ్యమయ్యె
మహి యటంచును ప్రబలితా • మసులు సేయు
కలుషవృత్తులు రూపంబు • గాంచెనాగ
నెల్లదిక్కులఁ జీకటు • లెలమి నిండె

కీర-ఉ. ఆవినువీధియందున స • దాళి ప్రకాశత మించియొప్పెడున్
భామి శుభోదయస్థితినిఁ • బంకజనాభుఁడు నీవు హస్తప
ద్మావళి లెత్తియొండొరుశి • రోగ్రములందునఁ బోయుముత్తి
యాల్, కీవని బోలె కంటివె చె • లీ! లలనామణి!
లోకమోహినీ!

చంద్ర.—సీ. రాత్రించరాధీశి•రంబుల నుఱుమాడఁ
గ్రాలెడు విష్ణుచ•క్రంబనంగ
దేవదానవులు సు•ధావార్ధిఁ ద్రచ్చంగఁ
గలిగినయమృతంపు•కలశమనఁగ
ముజ్జగంబులనేత•మూఁగినతమమును
బాపంగఁ బెట్టిన•దీప మనఁగ
ప్రాచీదిశాంగన•ఫాలతలమునందు
బెట్టినకుంకుమ•బొట్టనంగ,

తే. గీ. యామినీకాంతహస్తముఁ• దాడనిడిన
పద్మరాగంపుకెంపురా•బలతియనఁగఁ
గువలయహితానుమోదియై • యవతరించి
రాజు తూర్పున నలరారె•రమణి! కంటె.

రుక్మిణి—చెలియలారా! మీరేమేమో తలపోయుచు వర్ణించుచుంటిరి. కేశ
వుండు నిక్కంబుగా వచ్చునా?

చంద్ర—అమ్మాయీ! వచ్చునాయని యనెదవేల? రాఁడనియేటిసందియము.

రుక్మిణి—సీ. భూదేవతిలకుండు•పోయెనో! నడుము మా
ర్గమంబున నిల్చి•గాసిపడెనో
కంటకవనములఁ•గనుచు ధీరత లేక
భీతిల్లి వడఁకుచుఁ•బెగ్గడిలెనో
గిరినదీకుజపరి•సరసరణులఁ గాంచి
తెన్ను గానక కడు•దిగులుపడెను
అశనాదు లమరక•కృశియించు చుపవాస
గతులకు డీల్పడి•మఱియు నెడెను,

తే. గీ. ద్వారకాపురి చేరునఁ జేరు టేడ
యరిగి కృష్ణుని సౌధంబు నెఱుఁగు టేడ
కాంచి మాధవుతోడ భాషించు టేడ
చూడఁ జూడంగ కలలోని సొమ్ము జాడ.

విరిబోణులారా! బ్రాహ్మణుండు చేరియుండునని నిక్కముగా నమ్మఁజాల

కీర—అమ్మా! యటు లెన్నడు నెంచకుము. అశక్తుండ యినట్టైన నిక్కడ మనతో నేదేని యభ్యంతరంబుఁ జెప్పక మానఁడు. కష్టముల కోర్చి యెట్లయిన నిశ్చయముగాఁ బోయి కృష్ణునిం దోడ్కొని మఱలి యుండును.

రుక్మిణి—ఒకవేళ నీవు చెప్పినట్టు బ్రాహ్మణుండు చేరినట్టె యెంచినయెడల నాసమయమందు,

చ. హరి పురమందు లేక దనుజావళిఁ ద్రుంచఁగ నెందు నేఁగునో
మొఱలిడుచున్న భక్తులను బ్రోవఁగ నెచ్చటికైనఁ బోవునో
గురుజనబంధుమిత్రులను గోరికఁ జూడఁగ నెందుఁ జొచ్చునో.
ధరణిసురుండు గాంచక యెదైన్యత నిచ్చటి కేఁగుదెంచునో

కీర—అమ్మాయీ! ఇట్టిపిచ్చితలంపులను మనంబునఁ దలపోయకుము. ధరణీసురుఁడు ద్వారకకు వెళ్లునపుడు మంచిశుభశకునంబులం గాంచి మహానందంబుతోఁ జనినవాఁడు. కావున కృష్ణుండచ్చట నే యుండుం గాని మఱియుఁ బోసంగదు.

రుక్మిణి—నీవు సమయస్ఫూర్తివచనంబులచే నన్ను స్వస్థచిత్తం జేయుచుంటివే గాని, నాభాగ్యవశంబున వసుదేవసుతుం గాంచి బ్రాహ్మణుండు నాసందేశంబు విన్నవించినను,

చ. పొలఁతుకమాటలంచు మదిఁ బూని గణింపక చప్పరించునో
లలన నిమిత్త మేర్పడును లంపట లేల యటంచు నెంచునో

కలరు వరింపఁగా నిచట • కాంత లనేకు లటంచుఁ బల్కునో
తలఁపఁగ సంకటం బొదవెఁ • దత్తర మొందెమనంబు కోమలీ!

చంద్ర—వైదర్భి! జనార్దనుండు సకలభూతసంతాపనివారకుండు గావున నమ్మియున్న నీయెడ నిట్టితలంపు లెంచునా? నీ వేమియుం దోఁచక యిట్టు లాడుచుంటివిగాని యతండు శీఘ్రింబున నే వచ్చును.

రుక్మిణి—కరుణాతరంగితహృదయుం డగుపురుషోత్తముండు నాయం దనుగ్రహంబున నేతెంచఁ బ్రయత్నించినను,

సీ. మగవారు బిలువ స • మ్మతిలేని పెండ్లికిఁ
బోవు టేలని బల • దేవుఁ డనునొ
బంధువుగా శిశు • పాలుఁడు వానితోఁ
దగదు వైరమనినా • త్యకి బలుకునొ
చైద్యున కీనున్న • సకియఁ గోరకు కృష్ణ
నావి గా దని వసు • దేవుఁ డనునొ
మహిపైఁ దిన్నగా • మనుము నీ కేటి కీ
తెఱ గనిదేవకీ • దేవి యనునొ,

తే. గీ. నిలయమున ముందు గెల్చి యా • వలను రచ్చ
గెలువఁదగునంచు మిత్రులు • బలుకుచుండు
విధములును వారివాక్యము • ల్వినుచు నమ్మి
ననుఁ దలంచక మది విడ • నాడు నేమొ.

చంద్ర—అది యేమియోకాని సముద్రమందలి తరంగంబులచందంబున నీమనంబున నంతంబు లేనిసందియంబులు తోఁచుచున్నవి. ఆయన యెట్టి కార్యంబులందును స్వతంత్రుండై వర్తించు నేగాని యొకరిమాటల నెన్నండును వినువాఁడుకాఁడు. కావున నీసంశయంబుల వీడుము. త్రికరణశుద్ధిగా దేవకీనందను నీమనంబున ధ్యానంబు సేయుము.

రుక్మిణి—(అంజలిబద్ధయై) జగదేకసూత్రా! మేరుధీరా! పరాత్పరా!

[సుగంధివృత్తము:—

నందనందనారవింద•నందనాదినంద్యరా
కేందుసుందరావనేంది•రేశ దివ్యమందిరా
కందనర్ణభక్తబృంద•కల్పకా పరాత్పరా
మందరాద్రిధారణాస•మాన శౌర్యభాస్వరా.]

చ. ధరుండవు నీ వటంచు మది•దప్పక నమ్మినదాన నింక నీ, ప్ర
విమలచారుసత్కృపను•పాలను ముంచిన నీట ముంచినన్, అ
విరళభక్తి నీపదయు•గాబ్జముల న్విడ నన్య మొల్ల నో, భవ
నుత నీదుచిత్త మెటు•వచ్చిన భాగ్య మటంచు నెంచెదన్.

కీర—రుక్మిణీ! ఇంతదృఢభక్తియోగం బగుచిత్తంబుగలనీకు కరుణారసమయుం డగుహరి ప్రసన్నుండు గాకుండునా? మన మింక నిచ్చటం దడవుసేయుటవలనం గార్యవిశేషంబు లెవ్వియుం దెలియవయ్యె. గావున గృహంబు కరుగుదమా?

(తెరలో) చంద్రకళా, కీరవాణీ! చాలప్రొద్దు బోయె. మనయగ్నిద్యోతనుం డిప్పుడె వచ్చుచుండ నంతఃపురంబున నుండి వచ్చితి. రుక్మిణిం దోడ్కొని వేగముగా రండు.

చంద్ర—కీరవాణీ! రుక్మిణీ! మనసుశీలమాటలుగా నున్నవి. బ్రాహ్మణుఁడు వచ్చెనఁట. రండు రండు. (అని వేగంబున పఱుగెత్తును.)

కీర—అమ్మాయీ! విప్రుండు మహావేగంబున వచ్చెను. పోదమురమ్మ.
(అని రుక్మిణీ కీరవాణులుఁ బఱుగెత్తుదురు.) యవనిక జాఱును.

(భద్ర మందారు లను నిద్దఱుపౌరులు ప్రవేశింతురు)
(తెరలో కలకలధ్వనులు వినంబడును)

భద్రు—ఔరా! ఔరా! ఔరా! ఏమియాశ్చర్యమిది? ఏమి యీ కల్లోలము?

మందా—ఓరిబావా! భద్రా! రాటము తిరిగినట్లు తలద్రిప్పుకొనుచు నీలో నీవు కేకలువేయుచు నాశ్చర్యమభినయించుచుంటివి. కలువరించుచుంటివా? ఏమి?

భద్రు—ఒరేబావా! నీకేమైన చెవుడు వచ్చినదా? కన్నులు పోయినవా? ఊరిమీఁదికి పగలే బందిపోటుపడి దోఁచుచున్నట్లున్నది నేనేమి చెప్పుదును.

మందా—ఓరిమూర్ఖుడా! బందిపోటుబడుటేమిరా? నిద్రనిప్పుడేలేచివచ్చితివా? ఈయఖండధ్వని మనరుక్మిణమ్మ పెండ్లికై వచ్చిన చేదిపురనాథుండగుశిశుపాలభూపాలుని సైన్యసంకులధ్వనిరా.

భద్రు—అటులనా? (ఒకదిక్కునకు తిరిగి) అగరే! యీమూలనుండి వినంబడుశంఖాదినిస్వనంబులు హృద్భేదనంబు సేయుచున్నవే. ఈయుపద్రవఘోషం బేమి? అదుగో, సముద్రము పొర్లవచ్చుచున్నట్లున్నది. నేనిక్కడ నుండఁజాల. వెళ్లుదముగమ్మ.

మందా—ఓరిదరిద్రుఁడా! సముద్రముగాదురా ద్వారకాపురినుండి శ్రీకృష్ణుఁడు తరలివచ్చి, యీశిశుపాలుమూఁకలందఱిని రాజకుమారినిఁ బెండ్లాడునని చెప్పుకొనుచు (అదుగో) పురంబునంగలజనంబులు గుంపులుగుంపులుగా వెళ్లుచున్నారు. చూడుము. ఈధ్వని ద్వారవతీ సేనావాహినీజనితనినాదం బని నే భావించెద.

భద్ర—అటులనా? అబ్బో! మనముగూడఁ జూడబోయెదము గమ్మ. (అని రెండడుగులు ముందుకు నడచి) ఓయినాయనో? ఈమూల ఘోష యేమి?

మందా—ఓయిమందమతీ! ఇదియును తెలియదా? మనరాజుగారు రుక్మిణీదేవి నలంకారము సేయించి పురోపకంఠంబుననుండు వారికులదేవతయగు కాళికాలయంబున కరిగి యాతల్లికిఁ బూజసేయించుటకై వీథులలఁ దుత్సవంబు సల్పుచుఁ బోవుచుండు మంగళతూర్యాదినినాదం బురా యిది. అదుగో రుక్మి ఖడ్గపాణియై ముందు నడుచుచున్నవాఁడు.

భద్రు—ఓహో! అయితే మహాచిత్రము జరుగునే, యుద్ధముజరుగును
చూచెదముగమ్మ. (అనియిద్దరును) పోవుదురు.

(ఇది విష్కంభము)

(శిశుపాల జరాసంధులు ప్రవేశించెదరు)

శిశు—మగధరాజా! మనమనుకొనినట్టు లాకలహాముని చేసినకొంటెతనంబు
గదా యిది. మామా ప్రతిజ్ఞలు చెల్లించుకొనుట కిదే సమయమునుండీ.

జరా—శిశుపాలా! నీవేమియు నధైర్యంబు వహింపకుము.

ఉ. వచ్చినవాఁడు మాగధన్న పాలకుఁ డంచుఁ నెఱుంగరై రొకో
వచ్చిరి యాదవుల్ పిదప నారిమదం బడఁగింతు రుక్మితో
ముచ్చటసల్పి ముందుమన మూఁకలుగొల్వఁగ బాలికామణిన్
గ్రచ్చఱ వేచి యుండవలెఁ గాపునఁ బోదము రమ్ము మిత్రమా!

శిశు—నీవు చెప్పినట్లు సేయుటయే యుచితమైనకార్యము. కాని యీసమయంబున యాదవుల కెంతమాత్రము సందు నీకుండ మనము కార్యసాఫల్యంబు చేసికొనవలయు. పిలువనిపేరంటమున కీయదుకులుం డే మొగము బెట్టుకొని వచ్చినవాఁడు. వీనికి రవంతయు లజ్జ లేదు. నేఁటి దినము పగ నంతయుఁదీర్చుకొనుటకు సమయము చిక్కినది. కాని (అని తలియూఁచుచు) వాఁడు నాచేతఁబడి తప్పించుకపోయినప్పటికి గదా?

ఉ. కానును జేయనట్టిపలు గాకి బలానుజుఁ డేపుమీఱెనే, నాస
వరింప వచ్చినన రాధపుకూఁతును బెండ్లి యాడ ను, ల్లాస
ముతోడఁ జేరి మన లావు సెఱింగియు పోరఁజూచెబో, హా
సినిఁ ద్రుంచివాసనము తొంగనఁగూర్తుఁ రణోత్సవంబునన్.

అదుగో పురవీథుల నుత్సవంబుతో దుర్గాలయంబున కీమార్గంబుననె వచ్చుచున్నవారు. పోదము పద.

(అని పోవుచున్నారు.)

(శ్రీకృష్ణుఁడు రథసారథులతోఁ బ్రవేశించును.)

కృష్ణు—సారథీ! చైద్య, జరాసంధ, సాల్వ, పౌండ్రకులాదిగాఁగలశత్రురాజులం గాంచితివా?

సారథి—స్వామీ! తూర్పుభాగంబుగాఁ బోవుసేనావారంబులోపల శిశుపాలాదు లెక్కడనో?

కృష్ణు—గుఱుతులు జెప్పెద. నిలువంబడి వీక్షించుము.

ఉ. ముందఱ నేఁగుచు న్మదను●బూని చెలంగెడువాఁడె సూ జరా
నందనుఁ డామహీశు నెద●నమ్ముచునావల నుండె చేదిభూ
సుందరిభర్త వాఁడె బల●సూదనునైనను లెక్కసేయ రీ
మందల నున్నపౌండ్రకుఁ డ●మందుఁడు సాళ్వుఁడు దంత
వక్త్రుఁడుక్.

మనము వచ్చినపనినిఁ జూచుకొనకముందు వారితో యుద్ధంబునకు మార్కొనుట యుచితంబుగాదు. గావున, అదిగో, దుర్గావాసంబున మంగళవాద్యవిశేషఘోషంబులు వినంబడుచుండె. కాళికాపూజనంబునకై బాలికామణిం దోడ్కొని భీష్మకాదు లరిగినట్లున్నది. అగ్రజపురస్సరంబుగా సైన్యంబుతో మన మచ్చటి కరిగి యుత్సవంబుతో కల్యాణమంటపంబునకుఁ బెండ్లికొమరిక దఱియం జొచ్చునవసరంబు వీక్షించి వైనతేయుం డమృతకలశంబుంబలె వైదర్భిం గ్రహించి రథంబునం దిడికొని తత్క్షణంబ ద్వారకకుం జనవలయుఁ గాన సందఱుగదము రమ్ము. (అనిపోవును.)



## పంచమాంకము.

### (తృతీయరంగము).

కాళికాలయము.

రుక్మిణి ప్రదక్షిణము సేయుచుండును.

చంద్రకళ, కీరవాణులు, సత్యశీలయు ఆమె వెంబడి తిరుగుచుందురు. భీష్మకుండు, ధ్యానము చేయుచుండును. రుక్మిణి ఖడ్గపాణియై వెంటనంటియుండును.

రుక్మిణి—

శా. నీకుఁ బ్రమొక్కెద నమ్మ శాంభవి భవానీ దుర్గ నారాయణీ
నాకై మ్రొక్కులు చిత్తగించి కృపచే నాథుండు శ్రీకృష్ణుఁడే
గా కంచుఁ వర మిమ్ము నమ్మితి ననుం గన్నమ్మ నీకన్న నన్
సాఁకే వా రెవరమ్మ లోకజననీ శర్వాణి యోశాంకరీ.

[కవిరాజవిరాజితము:—
పురహరనాయికె మంగళదాయిని పుణ్యవిధాయిని శైలసుతే
పరమకృపాకరే మాధవసోదరి భక్తవశంకరి భద్రయుతే
సరసిజలోచనే పాపవిమోచని సాధుజనావని మానినుతే
సరసనుభాషిణి దానవశోషిణి స్వర్ణవిభూషణి సత్యరతే.]

(అని నమస్కరించి పాదంబులపైఁ బుష్పాదు లర్పించుచు).

రుక్మి—అమ్మాయీ! లగ్నంబు సమీపించినది. ఆలస్యంబు లేదు గాన వివాహమంటపంబునకుఁ బోవలయు. నా వెంట నే రమ్ము. (ప్రక్కకుఁ దిరిగి చూచి) చెలులారా! మీరు రుక్మిణిం బురస్కరించుకొనిరండు.

(అనియందఱు ముందునకు నడతురు.)

రుక్మి—(అంజలిబద్ధయై తనలో కృష్ణు నుద్దేశించి)

శా. ఆనందాంగనపైఁ గుబేరజులపై నాభీరకాంతాళిపై
ధేనువ్రాతముపై సుదాముపయి సాందీపార్యుపైఁ గుబ్జపై
నానాకాధిపుపై సరోజభవుపై నక్రూరుపైఁ గల్గిన
న్యూనంబౌ భవదీయసత్కృపను నన్నుం జూడుమా త్ర్యీశ్వరా!

ఉ. ఓయదువంశదీపక! కృపోజ్జ్వలచిత్త! సురేశవర్ణితా
మేయగుణప్రభావ నరమేసుధరాధరధర నామదిన్
నీయెడఁ జేర్చి వేఁడినను నీ విటు రాక తొలంగియుండు ట
న్యాయముగాదె యార్తసుజనావన ధర్మము లేదె మేదినిన్.

(అని కన్నీరునించుచు మెల్లగా నడచును).

రుక్మి—అమ్మాయీ! ఏమో విచారముతో వచ్చుచుంటివి. నీభాగ్యము పండె. అదుగో! నీమనోవల్లభుం డగుశిశుపాలుండు.

(కృష్ణుండు రథముతోఁ బ్రవేశించును)

కృష్ణు—సారథీ! ఈరాకాశశాంకవదన నారాక పొడఁగానమి దీనవదనయై వ్యాకులంబున వచ్చెడు రాకఁ గనుంగొనుము.

సీ. ఎలనాగ నెఱికురు లళితండములఁబోలు
గరిత నెన్నుదురు చందురునిఁ గేరు
చెలియకర్ణంబులు శ్రీకారములమీఱు
రమణికన్నులు మీలగములఁ దెగడు
పడఁతినాసంబు సంపగిపువ్వురూపంబు
నాతిచెక్కులి దర్పణంబు మిగులు
బిత్తరియధరంబు బింబసంకాశంబు
లలనపల్వంచు మొల్లల హసించు,

తే. గీ. శ్యామకంఠంబు కుచములు • బాహుయుగము
శ్రోణినఖపాదసుభ్రూరు • రుచులుజూడ
దరము గిరి లత సైకత • తారసమితి
సరసిజాకాశకదళికా • స్తంభతతులు.

ఉ. ఈతనుకాంతి యీసొబగు • నీసుమనోజ్ఞవిలాసలక్షణం
బేతరళాక్షికిం గలదె • యెంచినుతించఁగ మించె లెక్కకున్
ఈతరుణీలలామ భువి • నేదొ నిమిత్తముఁ బూని విష్ణుసం
పూతనికేతనంబు విడి • పుట్టినలచ్చియటంచుఁ దోఁచెడిన్.

సారథీ! వైదర్భిసమీపంబునకు రథంబు పోవనిమ్ము. (అని రుక్మిణిని సమీపించి)

ఉ. అండజయాన నాదువిమ • లాంఘ్రులు నమ్మిన దాన వౌట నీ
దండకు వచ్చినాఁడ నను • దప్పక చూడుము నేనె కృష్ణుఁడన్
భండనభీమవిక్రముఁడ • భద్రయశుండను రమ్ము శత్రురా
ణ్మండలిజూచుచుండఁగను • మానిని నిన్గొనిపోదుఁజూడుమీ.

(అని రుక్మిణీదేవి నెత్తి రథంబునం దిడి సారథితో)

చ. తడయక ద్వారకాపురప • థంబునఁ బోవఁగనిమ్ము స్యందనం
బడరి రిపువ్రజంబు మన • కడ్డమువచ్చినఁ గూల్చెదన్ భయం
పడకు మదగ్రజానుజులు • పార్శ్వములం దగ వచ్చి రింక నీ
పడఁతుక నాకు దక్కె నిటు • పట్టినకార్యము సెల్లె సారథీ!

సార—అయ్యా! దేవరవారు తలంచినకార్య మేది కాకుండును. ఇదే శత్రుసైన్యంబు మనరథంబున కడ్డుపడం జొచ్చుచున్నది.

కృష్ణ—అరదం బరుగనిమ్ము. (అని రథంబుతో నిష్క్రమించును).

భీష్మ—(ముందటికివచ్చి)

ఉ. నాతపముల్ ఫలించె సుర • నాయకపద్మజశర్వముఖ్యులు
ప్రాతనుతాబ్జపాదుఁ డగు • వారిజనాభుఁడు నేఁడు నాతనూ
జాతకు భర్తయయ్యెఁగద • జన్మము ధన్యతఁ గాంచెనింక నా
పాతకముల్ హరించెఁగదు • పావనశీలుఁడ నైతి ధాత్రిలోఁ.

(భార్యవంకఁ జూచి) సతీమణీ! మనకోర్కె సాఫల్యంబయ్యె. మనమింక గృహంబునకుఁ బోవుదము రమ్ము. (అని యిరువురు పోవుదురు).

రుక్మి—జరాసంధాదులం బురికొల్పి రథంబున కడ్డంబుజని యుద్ధం బొనర్చి నా చెలియలిం దోడ్కొని నా మనోరథంబు నెఱవేర్చుకొనియెద. (అని పోవును).

(యవనిక పడును)—(తెరలో కలకలధ్వని).

అరే! యదుకులపాంసనా? నిలునిలుము. శత్రుశార్దూలంబుల లెక్కంగొనక పగటిదొంగవై బాలిక నపహరించుక వెళ్లుచుంటివి. మానిశితశరజాల చక్రతోమరాది దివ్యసాధనంబులచే నీరథంబు నుగ్గునూచంబు గావించి నిన్ను చెండాడెదము. మాదాడికి బడలి భూమిపై నిలువరించక సముద్రంబులో దాఁగిననీవు నేఁ డెక్కడనుండి మగతనంబు వచ్చెరా? కన్నె నక్కడ డించి ప్రాణంబులం గాపాడుకొనుము.

× (భద్రమందారులు ప్రవేశించుచున్నారు).

మందా—అయ్యయో! ఏమిచిత్రమిది? మనరుక్మిపంతం బెంతలో భగ్నంబై పోయె భద్రా!

భద్రు—మందారా! అది నీకెట్లు తెలిసె. తద్వర్తమానంబు వినుటకై యిచ్చట నే నెదురుచూచుచుంటిని. ఏదీ! చెప్పుము.

మందా—నా కింకను భూమిపై బత్తెముండి యుద్ధమునఁ జావు తప్పించుక నే నిప్పుడే వచ్చుచుంటిఁగదా!

భద్రు—అయ్యో! అటులనా? యుద్ధవిశేషంబు లెట్లయ్యె నేమి?

మందా—తొలకరి మెఱుపుతీవియం బోలి వసుదేవతనయురథంబు చూచుట కగోచరంబై మూఁడుయోజనంబులదూరంబరిగియు, బలరామసాత్యకి

ప్రముఖం బగుతమచతురంగబలంబు కలసికొనకుండుటయెఱింగి రథ్యం
బులు నేదదీర్చికొనుట కవకాశం బిచ్చుచు నిలచియుండుటయు మగధ
దేశాధీశుండు గనుంగొని తనసైన్యంబును తక్కినయోధజన సేనావారం
బునుంబురికొల్పికొని యొక్క పెట్టున కేశవుస్యందనం బడ్డగించుటకు
నెలురేగి పౌండ్రక, సాల్వ, దంతవక్త్ర, శిశుపాలాదిగా శేషులెల్ల, తోమర,
భిండివాల, పరశు, ప్రాస, ముద్గర, ముసలాయుధానేకంబు లొక్క పెట్టి
కృష్ణునిపయిం బ్రయోగించి నొప్పించుచున్న యవసరంబున, బలరాము,
సాత్యకి, కృతవర్మాదులు సైన్యంబుతో డీకొని శత్రుసైన్యంబుల
చీకాకుపఱచుచున్నంత జరాసంధుం డరివర్గంబు నతిక్రమించి వాసు
దేవునిరథంబున కడ్డంబుజని కృపాణహస్తుండై యెదుఱ నిలువంబడె.
నంతలోఁ గొంత సైన్యంబు గ్రమ్ముకొనియె.

(తెరలో) ఓ భద్రమందారులారా! యుద్ధవిశేషంబులం దెలిసికొన
రాజుగారు మీాయిరువుర వేగంబుగా రమ్మనుచున్నారు.

మందా—అయ్యో! మఱచితినే? పోవలయు విశేషంబులక్కడనే విన్పిం
చెద. భద్రా! పోవుదము రమ్ము.

భద్రు—ఇచ్చటనే నాచెవులం బడనిమ్ము. అక్కడ వినుటకు మనస్స్థిమితం
బుండదు.

మందా— ఊహూహూ! ఇంత యాలస్యం బికనాకు ప్రాణహానికరం
బగును రమ్ము. (అని యిరువురు పోవుదురు).

(జయసేన, వీరసేను లనుగంధర్వులు ప్రవేశింతురు.)

జయ—(తెరవంకఁజూచి చెవియొగ్గి) వీరసేనా! నీకేమియుఁ బ్రాణభయంబు
లేదు. నాప్రక్క కిటురమ్ము.

వీర—జరాసంధుని ఘోరాకారంబె నాగుండెలఁ బ్రద్దలు జేయుచున్నది.
ఇంతట నిల్చి చూచుచుండుట మంచిది.

జయ—ఈ వీరరణస్థలాటోప భేరీభాంకార రావంబును, శంఖారావసంకులంబు

ను, నిఖిలాస్త్రప్రయుక్తపటుత్వశింజినీ టంకారఘోషంబును, చెవులకు చెవుడుగలవుచున్నయది. దగ్గఱకు రమ్ము.

వీర—(ప్రక్కకుం జేరి జయసేనుని సమీపించుచున్నాఁడు).

జయ—కృపాణపాణి యగుజరాసంధుం డతిరోషంబున మాధవుతోడ నేమో యనుచున్నాఁ డది వినుము. (తెరలో)

ఉ. చిక్కితి విప్పు డీవు మును•చేవయుఁ దక్కి యనేకమాఱు లీ
నిక్కపురూపు జూపక య•సీల్గుమనంచును దాఁగియుంటివ్రా
ముక్కడిజాతివాఁడ యిటు•ముందఱ నిల్చినవాఁడు మా
గధుం, డెక్కడి కేఁగె దింక వెడ•లించెదఁ బ్రాణము లీకృ
పాణిచేన్.

వీర—అందులకుఁ బ్రజ్వలితారుణాక్షుం డైనవాసుదేవుం డేమో యనఁబోవుచున్నాఁ డామాట విననిమ్ము. (తెరలో)

తే. గీ. తొల్లి నీవొనరించిన•దుండగంపు
సేఁతలకు నోర్చి పుచ్చుట•చేత మనితి
వంతియే గాని నాఁడె హ•లాయుధుండు
చంపఁడే నిన్ను నే నడ్డు•సల్పకున్న.

అప్పు డొకకారణంబుచే నిన్ను వధింపకుంటిమి.

వీర—అది యేమికారణమో!

జయ—మనకెట్లు తెలియును? వీరిచే నితనికి మరణంబులేదేమో.

వీర—ఓహో! జరాసంధకృష్ణు లిట వచ్చుచున్నవారే.

జయ—అయిన మనమీప్రక్కకుఁ దొలంగుదము (అనిప్రక్కకుఁ బోవుచున్నారు)

(జరాసంధుఁడు, 'చిక్కితివిప్పుడీవు' అనుపద్యంబుఁ జదువుచుఁ బ్రవేశించును.
(కృష్ణుఁడు 'తొల్లినీవొనరించిన' యనుపద్యంబు జదువుచు నాతనివెనుక యొకప్రక్కగాఁ బ్రవేశించును).

జరా—(కృష్ణుని కడ్డంబుగా నిలచి)

[సీ. మునికోలఁ బట్టుసే♦ర్పు నెఱుంగుదువె కాని
మొఱుగుదె యస్త్రశ♦స్త్ర్యక్షణంబు
ముచ్చిలించినవెన్న♦ముద్ద మ్రింగుటె కాని
దాయల నెత్తుఱుఁ♦ద్రావనేర్తె
కుల్కుచు బిల్లనఁ♦గ్రోవి యూఁదుటె కాని
సింహనాదంబులు♦సేయనేర్తె
సకియలతో విలా♦సంబు సల్పుటె కాని
మొనల భేదింప వే♦చనఁగ నేర్తె,

తే. గీ. గ్రామ్యధర్మైకరతుఁడవు♦గాన నీవు
రాజధర్మమెఱుంగుదే♦రణమునందు
విదితశస్త్రాస్త్రబహుకళా♦వేదినైన
నాదు బారిని బడి యెట్లు పోదు వీవు.]

బాలిక నక్కడ డించినను ప్రాణంబులతో నిన్నుఁ బోనియ్యను. (అని కత్తి ఝళిపించును.)

రుక్మిణి—(తనలో) వీనికెంతకావరము! ఇచ్చటనుండి పోనీయఁడు గాఁబోలు.

కృష్ణు—ఏమీ! మహాశూరుండ వనినీవు నిన్నే వికత్థనోక్తులం బ్రస్తుతించుకొనుచుంటివి. మూర్ఖా! యరదంబున కడ్డంబు తొలంగుము. నాదివ్య సాధనంబుల నెఱుంగవే!

సీ. చండభుజోద్దండ♦మండితఘనశత్రు
దండన మాగదా♦దండ మిదిగో
ధూమాయితానేక♦భూపవ్రజోద్రేక
తాపాటవం బగు♦చాప మిదిగో
శుంఠవైరిసమాజ♦కంఠలుంఠకకన
త్కనకమయం బగు♦ఖడ్గమిదిగో

క్రవ్యాదచక్రసంక్రకఘనగ్రథితాంశు
చ్ఛతసూర్యనిభ మగు చక్ర మిదిగో,

తే. గీ. భూరివిక్రము లౌసమి చ్ఛూరవరుల
శ్రవణపుటభేదనము సేయు శంఖ మిదిగో
ప్రాణ మేటికి గోల్పోయె దో నృశంస
త్రోవ కడ్డంబు లెమ్ము నీ త్రోవఁ బొమ్ము.

(అని ఖడ్గంబు ఝుళిపించును)

జరా—పదునెన్మిదిమాఱులు పిఱికిపందవై యెక్కడనో తల దాఁచుకొన్న పు డీపంచాయుధంబుల ప్రభావం బెక్కడ యగచాట్లుపడుచుండెనో! ఇదే! శత్రుగర్వనిర్భేదకం బగు మదీయగదాప్రహారణాంబున నీఝుళిపించుఖడ్గంబు భగ్నంబుఁ గావించెద నిటురమ్ము.

రుక్మిణి—అయ్యో! ప్రాణనాథునిం గోల్పోనేమోకదా! (తెరలో)

ఉ. సాళ్వనృపాలు ప్రేటువడి సంగరభూమిని వ్రాలి రౌద్రుఁడై
తెల్వియుఁ బూని వచ్చి రణనైరుఁడు సీరి మదీయవాహినిం
బల్వురఁ జంపి నాదెసకు వచ్చె నహో చెలికాని బిగ్గఱన్
బిల్వఁడు కంఠ మెత్తి పర భీషణసైనికులార గ్రచ్చఱన్.

జరా—(తనలో) ఓహో! సమయము తప్పివచ్చినది. చెలికానిఁ బిల్వ మనుచున్నాఁడే (అని తత్తరముతో) గళధ్వనివిన శిశుపాలునిమాటగా నున్నది. ముందువానిఁ బ్రతికించినఁగదా కార్యంబు నెఱవేరుట (ప్రకాశము) ఓరి యాభీరా! యస్మత్సహస్రాక్షౌహిణీవీరప్రతాపాబ్ధిం దాఁటి గదా నీవు పోవుట మేటిమగండవైన నీ విక్కడనే యుండుము. నే నిదే మఱలవచ్చెద (అని ప్రక్కకు తిరిగి) వీరయోధులారా! కేశవునిం గాఁచియుండుఁడు. బలరామునిరూపుమాపివచ్చెద (అని వేగముగాఁ బోవును.)

(మఱల తెరలో)

తే. గీ. పౌండ్రకవిముక్త మై • నట్టిపాపమ్ము
సాత్యకిం దాఁకి నిడుద • వక్షంబు దూఱె
నయ్యయో యెడనుండి • రయ్యంబుజాక్షు
సీరపాణులు దిక్కెద్ది • వీరి కిచట.

కృష్ణు—(ఆకర్ణించి) అయ్యో! మదీయసైన్యదీనాలాపంబులు వినంబడె. తమ్ముఁడా శైనేయా! నాగాస్త్రంబుచే భగ్నంబయ్యెదవా! తండ్రీ! గారుడాస్త్రం బిదో వచ్చె భయపడకుము. నీకు శుభం బగుఁగాక. దుర్మార్గా పౌండ్రకా! నిలు నిలుము, నే నిదిగో వచ్చుచున్నాఁడ— (రుక్మిణివంకంజూచి) సతీమణీ! నాచేయి విడకుము. దారకా! రథంబు పౌండ్రకునివంకకుం దోలుము.

రుక్మిణి—నాముద్దులమఱందికి శుభం బగుత (అని యిరువురు రథముతోఁ బోవుదురు)

(జయసేన వీరసేనులు ప్రవేశించుదురు)

జయ—వీరసేనా! బలరాముఁడు శిశుపాలునిఁ గ్రిందఁబడవైచి పైనం బడి పిడుగుంబోలె ముష్టిచే గ్రుద్దుచు లేచి కంఠంబునం దెసముపాదంబిడి రోషంబునం బలికిన నిష్ఠురోక్తి వింటివిగదా?

వీర—నేను పౌండ్రకసాత్యకులు పెనంగుచోటనుండి యిప్పుడే నీవు బిల్వ వచ్చుచుంటి నేదీ వినవలతుం జెప్పుము.

జయ:—

ఉ. పొత్తుగలట్టిబంధువుఁడె • పోయితఁడంచుఁ దలంచి మేము మా
యత్తనుదుల్ గ్రహించి పర • మాదరబుద్ధిని నీకు భూమిపై
బత్తెము నిల్పియుంట మమఁ • పాటియు జేయక వైరివై తెసి
కుత్తుకఁ ద్రొక్కితి యిపుడ • కోరుముని చెలికాని మాగధుక్

వీర—అబ్బా! యీయన కెంతకోపమయ్యా! అడుగో? చైద్యునివిడచి జరాసంధుని(బ్రేటునకుం జంకుచున్నాఁడే! లేదులేదు.ఒక పెద్దయేనుంగు నెత్తి వానిపయిం బడవైచుచున్నాఁ డటుచూడుము.

జయ-వీర—ఛచ్చెచచ్చె(అని పెద్దగా నఱచుచు చప్పటులు గొట్టుచున్నారు.)

వీర—అదుగో దంతవక్త్రుండు జరాసంధునికి సహాయంబుగా వచ్చుచున్నాఁడు.

జయ—ఏమి బలరామునిసాహసంబు ముసలంబున దంతవక్త్రుని దంతంబుల భగ్నంబుజేసె.

వీర—సాత్యకి బ్రదికియున్నాఁడే? అదుగో దుర్నిరీక్ష్యుండై సాల్వునిపై నాగ్నేయాస్త్రంబుఁ బ్రయోగించుచున్నాఁ డటుచూడుము.

జయ—ఆహా! ఇదియేమి? మహాప్రళయంబుగా నున్నదే? ఏమి యీ యాగ్నేయాస్త్రప్రభావము?

గీ. నిప్పులు నుప్పతిల్లి ధరణిన్ దివి నంతట నిండి మంటలన్
గుప్పుచు ధూమసంకలిత ఘోరము నై ప్రళయాగ్ని నాఁగఁ
బెన్, ముప్పు ఘటించుచున్నయది ముం దెటు సేయునొ
వైరిసైన్యముల్, తెప్పల నెత్తిచూచిన నరే! రుధిరంబులు
గాఱుకన్నులన్.

(అని తాపము నభినయించును)

వీర—అన్నా! జయసేనా! భూజలతాగుల్మకుసుమవిసరగ్రావంబుల భస్మీభూతంబు సేయుచు,చిట పెట ధ్వానంబుతోఁ జను దెంచునయ్యస్త్రంబుం గాంచి జరాతనయుం డమోఘం బగువారుణాస్త్రంబా! సంధించుచున్నాఁడు?

జయ—అవు నదియే.

వీర—(గడగడవడంకుచు) ఆగ్నేయంబె దీనికన్న సౌఖ్యంబుగా నున్నదే?

జయ—అట్లనెదవేల? ఆనిప్పుఁబుట్టి కీనీళ్లబుట్టి యుండుటంబట్టియే లోకం

బులు ప్రబిరికె. నదుగో! రుక్మి, పౌండ్రకభూపాలు రథంబు క్రింద
దూఱి యటునిటుఁ జూచుచున్నాఁడు.

వీర—భీష్మకుని కుమారుండా! యీశూరుండు.

జయ—(నవ్వుచు) ఆహా యితండె హరికి బావమఱంది.

వీర—అదుగో! వాసుదేవుండు పౌండ్రకస్యందనంబుఁ దుత్తుమురు గావించి
యాతనివెంటంబడి తఱుముచున్నాఁడటుచూడుము.

జయ—అగరే! కేశవురథంబు ద్వారకామార్గంబున వేగంబునం జనుచున్నదే!

వీర—భళిరే! రథంబువెంటంబడి ఖడ్గపాణియై రుక్మి పోవుచున్నట్టున్నది

జయ—అవునవును. వీనికింకను ప్రాయశ్చిత్తంబు గావలసియున్నది.

వీర—సాత్యకిబలరామాదులు బలంబులతో రథస్థులై ద్వారకకుఁబోవుచున్న
వారు. ఔరా! యేమి, బలరామ సాత్యకుల రథవేగంబులు.

జయ—పౌండ్రక, సాల్వ, దంతవక్త్రాదులు బలంబులతో వెనుకకు మఱలి
పురంబుల కేఁగుచున్నవారే!

వీర—కాలంబు గానిచో పోక యేమిచేయుదురు.

జయ—శిశుపాలుండు జరాసంధునిం జేరికొని దుఃఖాక్రాంతుండై యిటవచ్చు
చున్నవాఁడు.

వీర—ప్రొద్దుబోయిన దిక మన మైలబిలునిసభకుం బోవలయుఁగదా రమ్ము
(అనియిద్దఱుంబోవుదురు). (ఇది విష్కంభము.)



## పంచమాంకము.

(చతుర్థరంగము.)

### అడవి.

(శిశుపాలుఁడు దైన్యముతో జరాసంధునిహస్తంబుఁబట్టుకొని ప్రవేశించును.)

శిశు—మ. బలభిద్దారుణవజ్రమున్న శనిసంపాతంబునునోర్వలున
బలభద్రాయతముష్టిఘాతము దలంపం బ్రాణములోర్వసి

ములనిం కేటికి జీవితంబు సఖుఁడా॰ యిమ్మేను పాలించిపో
వలతున్నానము బోవఁ బ్రాణము హితం॰ బా! పరలోకాళికిన్.

(అని కత్తిచేఁ గంఠము నఱకికొనఁబోవును).

జరా— ఆ! చేదిభూపతీ యింతమూఢకృత్యంబు నవలంబించెదవా? నీవు చచ్చువాఁడవును, నేను బ్రతుకువాఁడనా? నాకు లేనిచిన్నతనంబు నీ కేల? (అని త్వరగాఁ జేతిలోనికత్తి పట్టుకొని తీయును)

(తనలో)

ఆ-వె. చెలిమి కానిఁ గోడఁ॰ బలికినట్టి ప్రతిజ్ఞ
లన్ని యడుగుఁ బట్టె॰ నన్ను గలసె
కాలమొక్కరీతిఁ॰ గడుపంగ నేర్తురె
శ్రీశుఁడైన నాయు॰ మేశుఁడైన.

(ప్రకాశముగా) దమఘోషనందనా! ఎట్టిమహానుభావులును ఎట్టిపరాక్రమధను లగుధరణీశులును కాలమహిమచే వంచింపంబడుదురు. ఇంతమాత్రమునకె మన మిట్లనుకొనుట తగవుగాదు. జయాపజయంబుల తెలంగొనరి కెఱుంగందగును.

సీ. ఇంద్రుఁ డాబలి దను॰ జేంద్రున కోడుట
చెలికాఁడ! కాలము॰ వలనఁగాదె
ఘనుఁడైనబలి త్రివి॰ క్రమునకు లొగ్గుట
సంగడీఁడా! కాల॰ పరణిఁగాదె
యమృతకుంభం బను॰ రాళికి నబ్బుట
శిశుపాల తత్కాల॰ వశతఁగాదె
కంజహితుండు గో॰ గర్భగతుం డౌట
స్నేహితుఁడా కాల॰ చేష్టఁగాదె,

తే. గీ. నలహరిశ్చంద్ర రామచం•ద్రప్రభృతులు
వనములం బడి కష్టంబు•లనుభవించు
టెల్ల కాలస్థితిని గాదె•యింత యేల
కాలమే దుఃఖసంతోష•కారణంబు.

శిశు—ఆ-వె. పెండ్లియంచు నేను•పేరాసపడి రాఁగ
నాశ నేఁడు కాల•పాశమయ్యెఁ
గాఁగలట్టికార్య•భాగంబు తుదముట్టె
నిట్టు లౌనటంచు•నెఱుఁగనైతి.

జరా—అవు నవును. నేనుమాత్ర మిట్లు కాఁగలదని యనుకొంటినా (అని
తలయూఁచుచు నాశ్చర్య మభినయించుచు) ఏమి కాలమహిమ.

చ. మగటిమిమీఱమున్ను పలు•మాఱులు మాధవునింజయిం
చితిఁ, నగధరుఁ డిప్పుడే పరులు నవ్వఁగ నన్ను•జయించి
పోయెఁగా, సగము వెలుఁగుగాఁచి యది•చన్న సగంబు
తమంబువచ్చునై, వగతిని దాఁటగాఁ దరమె•పద్మభవా
దుల కైన నెచ్చెలీ!

అదియునుంగాక:—

ఉ. మంచియుఁ జెడ్డయుంగలుగు•మర్త్యనికర్మనశంబుచేత యో
జించెద వేల యిట్టియెడఁ•జింతవహింపఁగ బాడియానె యీ
వంచనకుం బ్రతిక్రియయుఁ•బాటిలకుండునె మాగధుండు జీ
వించినకాలమంతయును•వృష్ణికులాటవి కీలియేగదా!

ఇట్టియెడ నీకు నేను చెప్పవలసినదేమియున్నది. విరోధి నెదిరించియు
జయింపమికి నీమదినుండువగఁ దొలఁగుము. ఇది మొదలు శత్రుప్రాణనిరోధ
కారణంబు లగుసమయంబు లనేకంబులు గలవు. ఇదియే యననేల? పురం

బునకుఁ బోవుదము రమ్ము (అని శిశుపాలునిహస్తంబుఁ బట్టుకొని తీసికొని పోవును).

(రుక్మిణీసహితుఁడై కృష్ణుండును, ఆవెంట ఖడ్గపాణియై రుక్మియును, బలరాముండును ప్రవేశింతురు.)

రుక్మి:—

ఉ. గొల్లఁడ వై జనించి మదిఁ గొంకక రాజకుమారి నైననా
చెల్లెలిఁ గొంచు వేఁజనుట చెల్లునె నీకు కులఘ్న పాపియో
కల్లరి మాతులాంతకుఁడ కామిని డించి పురంబుఁ జేరు మీ
యల్లరిసేఁత యేల యెటు లైనను నిన్నిపుడే వధించెదన్.

(అని ఖడ్గముఁ ద్రిప్పును).

కృష్ణ:—

ఉ. ఓరి దురాత్మ నీ విటుల నొంటరిగాఁ జనుదెంచి తింక నీ
వారలు లేరురా యిచట బారలుసాఁచక వచ్చుదారినే
యూరకఁ బొమ్ము రోసమున నోఁపిక నడ్డము వచ్చితేని నిన్
ఘోరసుదర్శనాహతినిఁ గూల్చి కృతాంతునివీటి కంపెదన్.

రుక్మి—ఓరి వెన్నద్రుచ్చా! యేదీ యింకమీఁద నీచక్రప్రయోగకౌశలముఁ జూచెద నిటు రానిమ్ము. (అని యెదురునడుచును.)

కృష్ణ—ఛీ దుర్మార్గా! రాజకులపాంసనా! నీకుఁ జక్రంబేల? ఈవామపాదంబుచేఁ దన్ని ప్రాణంబులం బాపెద.

రుక్మి:—

చ. కొలఁది యెఱుంగ కిట్టి పలు కూఁతలు కూసెదవేర దుర్మతీ
పిలువనిపేరటంబునకుఁ బేరిటు బెట్టుక వచ్చి మానమే
వలనను లేనినీవు నను భంగముఁ జేసెదవా నృపాధమా
తలఁ దెగ వ్రేతునిల్వుమిఁకఁ దత్క్షణమాత్రఁ గరాసిధారచేన్.

నీమాయకు బెదరి చెదరిపోవుదు ననుకొంటివా ?

కృష్ణు—(తనలో) వీఁడు మనంబునఁ గొంచెమైనను జ్ఞానములేనిపశుమాత్రుండు. వీనికి మానభంగం బొనర్చి యందఱు పరిహసించునటులఁ జేసెద. (ప్రకాశముగా) అరే! దుర్మార్గా యేమిహసితివి. (అని చక్రంబెత్తి యెదుఱు నడచును).

రుక్మి—(వెన్నుఁజూపి యొకప్రక్కకుఁ బోవును).

కృష్ణు—ఎక్కడకు పోయెదవు ?

పంచచామరము:—

కఠోరభాష లాడితోఁ◆కల్మషాకృతీ! నినున్
కుఠారధారచేఁ గుజంబుఁ◆గూల్చుభాతి దోఁపఁగా
హఠంబుతోడ వెంబడించి◆యట్టె నిన్నుఁ ద్రుంచెదన్
శఠా! నమస్కరించితేని◆జంప కే క్షమించెదన్.

(అని రుక్మి వెంబడి వేగముగాఁ జని యొకప్రక్కకుఁబోవును)

రుక్మిణి—కరుణానిధీ! మాయన్నను జంపకుము. రక్షింపుము. రక్షింపుము.

బల—కృష్ణా! చంపవలదు. (అని పెద్దగాఁ బల్కును).

(కృష్ణుఁడు రుక్మిని విరూపిఁగా నొనర్చి మెడను చేయి వేసి బలవంతముగా ద్రోసికొనివచ్చును.)

బల—ఎంతపని చేసితివి ?

కృష్ణు—ఉ. కత్తిని నెత్తిపైన నిడి◆గాదిలిబావవు రమ్మటంచు ని
న్నెత్తిలఁబట్టి రేవులుగ◆నోఁపికఁ? గొఱ్ఱెవిచిత్రవైఖరిన్
గత్తరపెట్టి సిదుపెదు◆గడ్డముమీసముజిత్తసేయ నో
రెత్తక పోవఁగానలదె◆యించుకసిగ్గును లేదె దుర్మతీ!

ఛీ-ఛీ యిఁకఁబొమ్ము.

రుక్మి—ఊఁ. నన్నింతపని చేసితివి. నిన్నిఁకమీఁద జరాసంధునిచేఁ గండలు కండలుగాఁ గోయించెద.

కృష్ణు.—(తనలో) వీని నమ్మరాదు. ఇదివఱకు మాయన్నగా గనిన ట్టీదుష్ట భూజంబునిఁక నుంచరాదు. చక్రంబుచేతనే వీనిశిరంబు ఖండించివైచెద. (ప్రకాశముగా) ఓరిసుమతీ! నిన్ను వధించక విడిచినయెడల నీ వేమోమో చేయుచుందువు. ప్రాణహానికరం బగుభుజగంబును జంపక విడిచిపుచ్చుట ధర్మంబుగాదు కావున నిదిగో నాచక్రంబుచే నీశిరంబు హరించెదఁ జూడుము (అని చక్రంబు ప్రయోగింపఁబూనును.)

రుక్మి—(గడగడ వడంకును).

రుక్మిణి—(అతిత్వరతోఁ గృష్ణునిచేయిఁ బట్టుకొని (ఓ దేవదేవా)

ఉ. దేవుఁడ వంచు బ్రహ్మమయ♦ తేజుఁడ వంచు సమస్తలోకజీ
వావనవర్తి వంచు నిను♦ నాత్మ నెఱుంగక మూఢుఁడై యస
ద్భావముచేతఁ దప్పులు శ♦తంబులొనర్చె మహాత్మ నీయెడన్
గావున నన్నుఁ జూచి కరు♦ణామతి వీనినిఁ గావు మచ్యుతా.

అట్లుగాక వీని నిప్పుడే మీరు వధింపఁ దలంతురేని,

చ. త్రిదశగణార్చితుండు హరి♦ దేవకినందనుఁ డల్లుఁ డయ్యె మా
కొదవలు దీరె నంచు జన♦కుండును దల్లియు నెంతొ సమ్మదం
బొదవి చరింత్రు వారలు ని♦జోద్భవుపోడిమి విన్నయంతనే
ముదమును బాసి దుఃఖనది♦ మున్గి కృశింతురుగాదె మాధవా.

నావిజ్ఞాపనం బవధరించి యగ్రజప్రాణత్రాణపరాయణులు గావలయు. (అని నమస్కరించును).

బల—కృష్ణా! రుక్మిణీప్రార్థనం బవశ్యం బాదరణీయంబుగాన వీనిం జంపవలదు. విడిచిపుచ్చుము. ఏ మట్లాలోచించెదవు? వాఁడు బంధువు సుమా!

తే-గీ. రమణిసన్నిధి రాకుమా♦రకునిఁ బట్టి
హాస్య మొనరించి వైరూప్య♦మందఁ జేసి

పరిభవించుట నీ కిది॰ పాడి యగునె
నలుకి వైచుటకన్న హైన్యంబుగాదె.

చాలుఁజాలును. మునుపే చచ్చినవానిని మరలఁ జంపుట దేమిధర్మము? నామాట విని వానిని విడిపించుము (అని కృష్ణునిచేతిచక్రంబు తీయును)

కృష్ణు—(తనలో) వీఁడు నారదుశాపంబునంజేసి మాయన్నగారిచే వధ్యుండు గావలయు. నే నిప్పుడు వీనిఁ జంపఁ దలంచుటచే తాపసవాక్యంబుఁ నిరర్థకంబుఁ జేసినవాఁడ నగుదుఁగావున వీని విడిచిపుచ్చెద. (ప్రకాశముగా) భీష్మకకుమారా! పో పొమ్ము.

బల—(రుక్మిణిని సమీపించి)

శా. నాతోఁబుట్టువుచేత నగ్రజుఁడు బన్నంబొందినాఁడంచునీ
చేతంబందున దుఃఖమొంది కడు నశ్లీలోక్తులర్క బల్కకమ్మా
తప్పింప వశంబె పూర్వభవక॰ర్మప్రేరితావేశసం
జాతానేకశుభాశుభానుభవముల్॰చర్చింప నోసుందరీ!)

(తెరలో) అదె యాదవేంద్రులు ద్వారక కేఁగుచున్నారు.
వారిం గలియఁబోవుదము రండు.

రుక్మి—(తనలో) నేను మగధపురంబునకుం జని జరాసంధుం గూర్చుకొని యేవిధంబుననైన వీరిం దెగటార్చునుపాయంబుం బన్ని వీరిరూపంబుల మాపి గాని నేను కుండినపురంబు సొరను. వీరే రుక్మరథుండును, నారదుండును, నగ్నిద్యోతనుండును, విదర్భనుండి రథారూఢులై యిక్కడకుఁ జనుదెంచుచున్నవారు. ఈరూపంబున వారిమొగంబుల నే నెట్లు గాంతును. పోయెదను. (అనిపోవును)

బల—ఓహో! యీమార్గంబున నెవరోవచ్చుచు మమ్మఁ జేర్కొనుచుండిరి. మాడఁగా, నారదువీణాగానంబు వినవచ్చుచున్నది. సారథీ! మనరథం బాదిక్కునకుఁ మరలనిమ్ము (అని యందఱుఁ బోవుదురు).

—oo※oo—

## ంచమాంకము.

### (పంచమరంగము).

### శ్రీకృష్ణభవనము.

(కృష్ణుండును, రుక్మిణియు, బలరాముండును, రుక్మరథుండును, అగ్నిద్యోతనుండును, గొలువైయుండ ముత్తైదువలిద్దఱు మంగళంబులఁ బాడుచుందురు.)

నార—(కృష్ణునిం జూచి)

ఉ. శత్రువులం జయించి పృథుశ♦క్తిని భీష్మకధారుణీశు స
త్పుత్రినిఁ గొంచు ద్వారకకుఁ♦బొంకము మీఱఁగ జేరినాఁడ వీ
నేత్రములన్ వధూవరుల♦నిండిన ప్రేమను గాంచి భద్రచా
రిత్రముఁ బాడుచున్ భువిఁ జ♦రించెద భీష్మకజామనోహరా.

కృష్ణ—భవత్కృపావిశేషంబుచేత నే కదా? నేను గృహస్థుండ నైతిని.

నార—(నవ్వుచు) కేశవా! నీయుదారలీలావిలాసోక్తులు వినుటచే నా డెందం బాశ్చర్యనిమగ్నం బయ్యె. నాకృపావిశేషం బెక్కడ? నీవు గృహస్థుండ వగు టెక్కడ.

సీ. ధరణీభరంబు మూ♦ర్ధంబుల వహియించు
శేషాహి యెవ్వాని♦సెజ్జగీము
దినము రాత్రిని నిజ♦దీప్తిచే వెలిగించు
రవిచంద్రు లెవని నే♦త్రద్వయంబు
నిఖిలలోకంబుల♦నిర్మించుధాతను
బుట్టించె నెవ్వాని♦బొడ్డుతమ్మి
కలుషలోకావళిఁ♦గడుఁ బునీతులఁ జేయు
స్వర్ణదిఁ గనె నేని♦చరణయుగము,

తే. గీ. అట్టి బ్రహ్మాంబ వాదినా • రాయణుండ
వైననీ విప్రఋషుల • నవతరించి
మీఱ లీలాగృహీత • శరీరవైగ్ర
హస్థ నేఁ డైతి ననుట చో • ద్యంబుగాదె.

కృష్ణ—మునీంద్రా! మీవంటి తపోధనులకు వేద్యంబుగాని విషయం బేమి కలదు.

అగ్ని—తే. గీ. మంగళం బగు నీకు సా • రంగనేత్ర
ఘనవిపినలవికాస రం • గద్విలాస
మావిదర్భాత్మజను గూడ • మహి నఖండ
వైభవంబులఁ గను మింక • వాసుదేవ.

కృష్ణ— (నారదునివంకం జూచి) దేవర్షివర్యా (బ్రాహ్మణునిం జూపుచు) ఈబ్రాహ్మణోత్తముండు మాయెడఁ బరోపకారబుద్ధి వహించి యీకార్యంబుం బరిసమాప్తి నొందించిన మహానుభావుండు సుమా (బ్రాహ్మణునింజూచి)

ఉ. కోమలివాక్యములు వినుచుఁ • గొంకక దుర్గవనోగ్రభూములెం
తో మితిలేనికష్టమునఁ • దొందరపాటున దాఁటి వచ్చి న
న్బ్రేమను గాంచి మద్విధముఁ • బ్రేయసి కేర్పడఁ జెప్పి నిత్యశో
భామలకీర్తి నొందితి మ • హాత్మ నినుం గొనియాడ శక్యమే.

నార—ఈరుక్మరథుండు బాలుం డయ్యును విజ్ఞానంబునం జేసి పూజార్హుండు సుమా!

కృష్ణ—అందుకు సందియం బేమి. ఈతనివృత్తాంతం బిదివఱకే మీరు నుడివి యుండుటచే నే నెఱింగితిని. ప్రేమాతిశయంబున మావెంట వచ్చుటచేతనే యీతండు సద్గుణాకరుం డనినుతింపవలసినదే కదా?

రుక్మిణి:—

ఉ. అన్నతలంచు కార్యవిధ•మారసి లోనఁ గృశించుచున్న హా.
పన్నుఁడ నైతి నిందనుకఁ•బంకజలోచన నీవు నేఁడు మా
కన్నకు భర్తవైతి విది•గాంచి యనంతసుఖాబ్ధిఁ దేలితిన్
మన్ననఁ జేసి సత్కృపను•మానినిఁ జక్కఁగ నేలికొమ్మికన్.)

ముత్తైదువలు—మంగళమహాశ్రీవృత్తము.

మంగళము కృష్ణునకు•మంగళము శ్రీశునకు•మంగళము సంతతము రాధా
సంగునకు మానివర•సన్నుతపదాబ్జునకు • సాంద్రకరుణాంబుధికి నీలా
భాంగునకుఁ గాళియఫ•ణాగ్రనటనాంఘ్రినక•హార్పతిసమ ప్రభునకు న్సా
రంగవరదాతకు సు•రప్రకరవంద్యునకు•రమ్య మగుమంగళ మహాశ్రీ. )

నార—బలరామకృష్ణులారా! ఇఁక మేము బోవలయుఁగాన సమ్మతిం

బల—మునీంద్రా! ఈదినంబు రుక్మిణీకృష్ణులకు నూరేఁగింపు(=పురోత్సవంబు) సల్పవలయుంగాన నిందే నివసించవలె నని నాకోరిక.

నార—మీయిష్టంబు నెఱవేర్పవలయుఁగదా? ఇంక లోకంబున నీభరతవాక్యంబు వెలయుంగాక.

సీ. పడఁతుక గోరు సద్గుణ•వంతుని భర్తగఁ గూర్చుగాక యె
ప్పుడు జనకాజ్ఞల న్వినుచుఁ•బుత్రులు పూని చరింత్రుగాక నే

ర్పడర బుధోక్తుల న్వినద • మామతి నార్తులఁగాత్రుగాకయీ
పుడమిజనుల్ ముకుందపదపూజన మేమరకుంద్రుగావుత

(యవనిక జాఱును.)

శా. శ్రీరామామలదివ్యపాదనళిన • శ్రీభక్తి దీపింపఁ ద
త్కారుణ్యంబున రుక్మిణీపరిణయా • ఖ్యంబైన గ్రంథంబు
తారామాఖ్యుఁ డొనర్చె నంచితసుధా • ధారోక్తిచే నిద్ది నీ
రేజాప్తహిమాంశుతారకముగా • నిత్యంబు భాసిల్లుతన్.

గద్యము. ఇది శ్రీసీతారామచంద్రకృపాకటాక్షలబ్ధకవితాధారేయ బుధ
విధేయ సీతారామనామధేయ ప్రణీతంబైన శ్రీరుక్మిణీపరిణయం బ
నాటకంబు సర్వము సంపూర్ణము.

శ్రీ రుక్మిణీకృష్ణార్పణ మస్తు.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ.



